శ్రీ

Sl. No. 372
4843
694
4-11
14/1971

# సోదరి.

ఇది

ఆచంట సూర్యనారాయణ రాజుగారిచే

రచియింపఁబడి

హిందూ సుందరి పత్రికాధిపతులకు

సత్తిరాజు సీతారామయ్య గారిచే

స్వకీయ

దేశోపకారి ముద్రాక్షర శాలయందు ముద్రింపించి

ప్రచురింపఁ బడెను.

బందరు :— కృష్ణా జిల్లా

1911

వెల రు 0-1-0

# హిందూ సుందరి.

## తండ్రి—కుమార్తె.



కు—నాన్నగారూ? అవేమి పుస్తకములు ఆపిల్లలు అల్లా పట్టుకుపోతున్నారు

తండ్రి—అమ్మా? అవిహిందూసుందరి పత్రికలు.

కు—వాటికేమి యివ్వవలెను.

తం—సం॥రమునకు రెండురూపాయిలు యిస్తే, నెలకొకసారి యిటువంటి సంచికలు పంపెదరు.

కు—ఇంతేకద, రెండురూపాయిలు యిచ్చి నాకుపత్రిక తెప్పించిపెట్టరేరా? నాచదువుకోవ్వటము లేదా. నిన్నటిమీటింగులో మీరేకాదు స్త్రీలకువిద్యచెప్పించమనిరి.

## చందా పద్ధతులు

| | |
|---|---|
| చందా దారులకు సం॥కి | రెండు రూపాయిలు, |
| అభి మానులకు సం॥కి | అయిదు రూపాయిలు, |
| పోషకులకు సం॥కి | పది రూపాయిలు, |

(1) అభిమానులుగానుండువారికి పోషకులుగా నుండువారికి సాలాఖరున ఆసాలు సంపుటము బయిండుకట్టించి ఉచితముగా నీయబడును.

(2) పోషకులుగానుండువారి కదనముగా ఆసాలుసుందరిలో ప్రకటింపబడిన గ్రంథములు రకమునకొకటి యుచితముగా బంపెదము.

(3) చందాసొమ్ము ముందుగ బంపవలెను. బాకీయుండుచందాదారుల చందాసొమ్ము వి. పి. గా వసూలు చేయబడును.

(4) ఏనెలలో చందాదారుగా చేరుదురో ఆనెల మొదలుసం॥రం వరకుపత్రికలు బంపబడుచుండును. వెనుకటినెలల సంచికలుకోరిన పంపబడును.

---

వలయువారు హిందూసుందరి మేనేజరు కంతేరు
కంతేరుపోష్టు కృష్ణాజిల్లా అని వ్రాయవలెను.

శ్రీ

# సోదరి.



ఇది

ఆచంట సూర్యనారాయణ రాజుగారిచే

రచియింపఁబడి



హిందూసుందరి పత్రికాధిపతులగు

సత్తిరాజు సీతారామయ్యగారిచే

స్వకీయ

దేశోపకారి ముద్రాక్షరశాలయందు ముద్రించి

ప్రకటింపఁబడియె.



కంతేరు :—: కృష్ణాజిల్లా

1911

వెల రు 0-1-0



శ్రీరస్తు.

# సోదరి.



## మొదటి ప్రకరణము.



నూరు గజములకంటె నెక్కువ వెడల్పు లేదు. అది చిన్న సెలయేఱు. అది పారుచుండెడి ప్రదేశములోఁ దనకు సాధ్యమయినంత జలమును కానుకగాఁ దనయజమానురాలగు గంగానదీదేవికి సమర్పించుచున్నది. వేసవికాలమందుఁగూడ విశాఖపట్టణ మండలములోని కొన్ని సెలయేళ్ళవలె కాక చల్లనిజలము పారుచుండును. ఈ సెలయేఱుపుట్టిన కొండలు హిమాలయ పర్వతములకుఁ జెంతనే యుండుటచేత వేసవికాలములో మంచుకరగి నీరై యీయేటినిండఁ బారుచుండును.

ఆయేఱు మన భూగోళగ్రంథములందుఁగాని విపులముగా నాయా జలప్రదేశముల విశదీకరింపఁబడిన పటమందుఁగాని కానరానంతచిన్నది. దానినిప్పు డే పేరునఁ బిలుతురో చెప్పఁజాలము కాని, యాసెలయేటికి బూర్వము "ప్రియత,, యనుపేరుండెను. ఇప్పటికైనను ఆసెలయేటికంత కుఁగాక పోయినఁ గొంతవఱకైన నాపేరుండకపోదు.

జనులు కాఁపురముండుటకు వలయు వసతులలో నీటివసతి మొట్టమొదటిది. ఎడతెగకుండ సర్వకాలములు నీరే సెలయేటిలో నుండుటచేఁ బెక్కుగ్రామములు రెండుప్రక్కలనుండునని చదువరులూహింపక పోరు. మనకథ యీయేటియొడ్డుననున్న గ్రామములలో శ్రీరామపురమందు జరిగినది. ఆహా! ఎంతపుణ్యముఁ జేసికొని శ్రీరాముఁడు కౌశల్యాగర్భమున నుద్భవించెనోగాని యీమహామహుని నామము, గ్రామము

నకుఁ బేరుపెట్టిరియో, యిండ్లకుఁబేరుపెట్టిరియో, పుత్రికాపుత్రులకుఁబేరు పెట్టిరియో, యిట్లేనో యొక యాధారము స్మరియింపని హిందూకుటుంబమా సేతుహిమాచలపర్యంత పరివ్యాప్తవిశాల ప్రదేశములో నొక్కటియునను గానరాదు. మహారాజాధిరాజుమొదలు గర్భదరిద్రుని వఱకు గల హిందువులా మహాత్ముని పవిత్రనామమును, తాముజాలిఁజూపవలసి వచ్చినప్పుడెల్లఁ దలంతురు. వేయేలనైన నమేయాతఁడనినమ్మి తన్నామస్మరణముచేతనే ముక్తికలదనియు, ఆతనిచారిత్రమువినుటచే పాపహరణమగుననియు' నమ్మిదేవాలయములు భజనశాలలు కట్టించిగొలుచుచున్నారుగదా? అట్టి శ్రీరామభక్తులలో నొకఁడైతాను కట్టించిన యీగ్రామమునకా పేరుపెట్టి యేపుణ్యాత్ముఁడో తనయభిలాషతీర్చుకొనెను. భగవంతునియవతారమని హిందువులునమ్మిన శ్రీరాముని పేరుపెట్టుటచేతఁగాదుగాని యాగ్రామము స్వభావసిద్ధముగానే సమస్తసదుపాయములుకలిగి దానివంటి పెక్కితర గ్రామములకంటె వాసికెక్కియున్నది. పట్టణములకుండెడు సదుపాయములు లేవుగాని మనకృష్ణా గోదావరీ మండలములందని గ్రామములవలెఁ బెంటకుప్పలు పేడపోగులు ఎగుడు దిగుళ్లు గల వంకరటింకర వీధులులేక తీర్చినట్లు వీధులును, ఇరుప్రక్కల మంచి మంచి గృహములును, పురముచుట్టును, ఏటిపొడుగునను తోటలునుకల, యా శ్రీరామపురమును హఠాత్తుగాఁజూచిన నాఁడొక పారిశుద్ధ్యసంఘముపాలించు నొకపట్టణమనిగాని నొకబుద్ధిమంతుఁడైన చిన్నరాజు కాఁపురముండు గ్రామమనిగాని తలంపకపోఁడు. గ్రామమునకు పొడుగునను ఏటియొడ్డున వెడల్పైన రాతిమెట్లు కట్టఁబడియున్నవి. బట్టలుతుకువారలు, స్నానముచేయఁదలఁచినవారు, పాత్రలుతోముకొనువారు, ప్రవాహమునకు దిగువభాగమందుఁ దమపనులు చేసికొనవలయునే కాని యితరచోట్ల సేయనీయరు. ఒకవేళఁజేసినచో శిక్షించువారు లేరుగాని యీ గ్రామవాసులు తామేర్పఱచుకొనిన నిర్ణయమును దాటుటకు యత్నిం

పను. పరిజలింత శుచియందు నిలకడ యైన బుద్ధికలిగి యుండుటకును, ఆ గ్రామమంత పరిశుభ్రముగా నుండుటకును, ఆగ్రామనివాసియగు కాశీపతిసన్న బాబుగారు కారకులు. ఆయనభాగ్యవంతుఁడు. హంస పురము ద్వారగ్రామము అను రెండుచిన్న గ్రామములలో భూములెన్నియో కలవు. ఏఁడాదికి సుమారు రు 6000 ల ఆదాయమువచ్చును. ఆయన నే పట్టణమందైనఁ గాఁపురముండక శ్రీరామపురమందలి సౌఖ్యమునుఁగాంచి యచ్చటస్థలము సంపాదించి చక్కని మేడ యొకటి కట్టుకొనియుండెను. ఆయింటికి సింహద్వారమున్నను ప్రక్కను మరియొక గుమ్మముకలదు. అది పుష్పలతోటలోనికి గుమ్మము. ఆపుష్పవనమున చక్కని సన్నని మార్గములుకలవు ఆతోవలకిరుకెలంకుల [illegible] రెండడుగులవెడ ల్పుగు ముద్దులమూటగట్టు పుష్పముల మొక్కలు బారులుతీరియుండును. ఆ తోటమధ్యమునను న్న గచ్చుతొట్టినుండి యీపూలతోటకు తోటమాలులు నీరుతోడుచుందురు. ఈమేడకు పశ్చి[illegible]. కాఁపురమున్నది. ఆమెయింటికి నొకించుక దూరమున నొకచిన్న [illegible]రియిల్లు కలదు. అందు భార్యాభర్తలు కాఁపుర ముండిరి. తనదారిద్ర్యమునకు విచారించుచుఁ గాలముగడుపుకొను నుపాయము వెతకుటలేదుసరిగదా? మీఁదుమిక్కిలి యాపెనిమిటి మిగులకర్కశుఁడై కఠినాత్ముఁడై యోగ్యురాలయిన తన భార్యనుఁ గొట్టుచుండెను. నాఁడాభార్యను శిక్షించుటకుఁ గారణము భర్త కోరినవస్తువు తెచ్చి వండకపోవుటయే. భర్తను తిరస్కరించు నుద్దేశము పాపమాస్త్రీకి లేదు. దారిద్ర్యము, భర్తసంపాదనతక్కువ. వాఁడుకోరిన వస్తువుగృహమునలేదు. తనకుఁబరిచయముఁగల వారియిండ్లకుఁబోయి యావస్తువు సంపాదింపఁగోరినదికాని లభింపలేదు. ఇంకనామె యేమిసేయఁగలదు? ఆనేరమునకై శిక్షననుభవించుచున్నది. ఇది యాదినమున కాలినశిక్ష. శిక్షలేనిదినము, నిరాహారముగానిదినము లేదు. మగఁడు కొట్టిన దెబ్బలకాయింతి యేడ్చుచున్నది. తాను పెనుకొనినానపు [illegible]ంటిలోను

న్న యీరోజు దానికెట్లా నష్టపు సాధ్యపడునని యించుక యైన యోచింపక మీరుమిక్కిలి నోటికివచ్చినట్లు దిట్టుచుంటిరి. ఆగంపవరగోళమంత యుండనయింటి సమ్ముఖములో నిలిచియున్న తారవిని "అటువంటి మగని మొగముపై నిప్పులుపోయవలెన" ని పలికెను.

జయగోపాలుని భార్య పుష్పలతోటలోనికిపోవుచు సమ్ముఖములో నిలిచియుండి తారపలికిన పలుకులు కరేలున మనసునకునాటంగా "భర్తయెంతకఠినాత్ముడైనను భార్యయట్లుకోరదు" ని పలికెను. తారయామె కన్నంతసున్నితమైన మనసుకలదికాదు. ఈమాటవిని తార "యిటువంటి నిర్భాగ్యులను కూర్చుకొనుచును అగు భర్తతోడంగా ప్రయాణముసేయుటకంటె నేనుజన్మములవఱకు సిద్ధమై యుండుటయే మేలు" ని పలికి యింకేం బలికినగాని మొగమునెత్తకయే లోనికిజనియె. వెంటనే జయగోపాలుని భార్యయుందలుపువేసి చక్కవచ్చెను.

## రెండవ ప్రకరణము.



తోటలో నూతిచెంతనున్న చిన్నతిన్నెపయి శకుంతల కూర్చుండి తన లోం దానిట్లనుకొనియె. "నాభర్త యొకానొకప్పుడు నామీందం దీవ్రముగ నాగ్రహముం జూపినను తారపలికినంత తెగువతో నామెతలంచినంత కఠినముగా నాభర్తనుంగూర్చి యెన్నండు నేననుకొనం దగినదేమియు నాకు గాన్పింపకున్నది. భర్తయాగ్రహోద్రిక్తుండై నను, నిముషములో తిరిగి ప్రసన్నునిగాం జేసికొనశక్తి స్త్రీయందు సహజముగాంగలదు. స్త్రీకిసొమ్ము మంచివర్తనము, భర్తపై నిష్కల్మషమైన ప్రేమయుండినయెడల భర్తనుం బ్రసన్నునింజేయుశక్తి పుట్టును. ప్రసన్నుండుకాంగానే పశ్చాత్తాపమొందును. మనయాత్మబంధువులకుం జేయునుపకారమేమియు కపుడు భర్తకిష్టములేనిది కావచ్చును. అప్పుడు మనము సేయుపని యోగ్య

మైనదేయని యంతరాత్మ బోధించినపుడు శాంతవచనములతో భర్తను
నను ద్రిప్పయత్నింప వలయును. ఎప్పుడయినను భర్తధర్మము న్యాయ
మువిడిచి యన్యాయమున కొడిగట్టినపుడు జేతనయినచోఁ దానుగానిచే
తగాకున్నచో నాతనిసన్మార్గమునకుఁ ద్రిప్పఁగలిగిన యధికారము కేగాని
వాని మంచితోఁ ద్రిప్పనుఁ జెప్పుట స్త్రీకవసరము. ఈసందర్భమునఁ గూడ
భర్తకు క్షేమమే యోగ్యురాలు కోరును. గాని స్త్రీ యెంత విసిగినను తా
నచెప్పినట్లు కోరదు" ఈరీతిగాఁ దలంచుకొనుచున్నపుడు భర్త దేశాంతర
మునుండుటచేఁ దనహృదయకమలమున నడఁగియున్న మరందమునుఁబో
లినయనురాగము మనసునఁదట్టగా నింక నచ్చటనుండ లేక వెంటనే శయన
గృహంబునకుఁబోయి భర్త పరుండినచోటఁ బరుండి యాతఁడు తలక్రింద
బెట్టుకొను దిండుఁదీసి వాసనచూచి వెంటనే లేచి తలుపు చేరవేసి చప్పు
చప్పునఁ బెట్టెలోనున్న తనభర్త తేజః పటమునుఁ దీసి నమస్కరించి ముద్దా
డి తనయెదఁ జేర్చుకొని యా పెట్టిలోనేయున్న భర్త వ్రాసినయుత్తరముల
లోఁ గొన్ని చదివి విచారముచే వచ్చుకన్నీటినిఁ దుడుచుకొనుచుండెను.
ఆహా. ప్రేమయెంతకు చేటు! దూరదేశమునున్న భర్తపై యోగ్యురాల
గు భార్యనూ పెను ప్రేమయెంతయో, మనసునఁబడు బాధ యెంతయో
తెలిసికొనఁ గోరువారు స్వయముగా ననుభవింప వలయును. లేదా శశిక
ళాహృదయమునఁ జొచ్చి పరిశీలింప వలయునుగాని, వ్రాసిచెప్పుటసాధ్య
ము. శశికళ యిపుడు చూపు ననురాగమును యోచింపఁగా భార్యాభర్త
లకుగల యన్యోన్యానురాగము వారికి స్నేహప్రారంభమైనది మొదలు
వారివయసుతోఁ బెరుగుచుండు నేమోయని తోఁచుచున్నది. నిశ్చయ
ముగాఁ బెరుగును. శశికళ కన్య కావని మీరలే యెఱుఁగుదురు. వివాహిత
భర్తతోనదివరకుఁ బదియాఱేండ్లు కాఁపురము చేసినయువతి మూఁడేరా
లుకన్నది. విమర్శనజ్ఞ, ధైర్యముకలది. తాను చేపట్టిన కార్యము న్యాయ
మైనదనితోఁచిన నింక నెన్ని కష్టములైన నోర్చితుదకుఁ బోయిమునకు

భంగమువచ్చునను లక్ష్యముసేయునట్టి సాహసిక. భర్తపై నిష్కల్మషమైన ప్రేమకలది. ఏగానంతానవతి. ఇంతకుబూర్వము పదియాఱేండ్లొక్కటే నాయవిడువక యున్నవారైనను. ఆకాలమంతయు వత్సరమొకనిముష ప్రాయముగానున్నట్లు తోచెనేగాని యిపుడుభర్త చెంతలేని సమయము న నకస్మాత్తుగా మర్ఛరమగుప్రేమ మనసుజనియించుటచే పాపమా లలనామణికిక్షణమొక వత్సరముగకంటెను దీర్ఘమైనట్లు తోచుచున్నది ఏమిచేయగలను? భర్తకడకు మఱునాడు పైనమగుటకునిశ్చయించినది, కాని యదిసాధ్యముగునట్లు తోచలేదు. ఇట్లాగదిలో నుండగానే యమ్మా యని పిలుపువినబడెను. ఆపిలుపునకుదిరిగి ప్రత్యుత్తర మిచ్చుటకే వి సుగుపుట్టించునంతటి ప్రేమమనసులో నుద్భవించినది. తిరిగిపలుకక కుండుటచే మఱల "అమ్మాయీ! ... నిలిచిరిగి కేక వినబడెను. "గది లోనుంటిని,, అనిమాత్రము ... ది.

పదునాఱేండ్లు భర్తతో గాఁపురముచేసి సంతానవతియైన యువతి యౌవనవంతురాలై నూతనముగా భర్తతో మైత్రి చేసికొనుచుండుకో మలివలె మోహపరవశురాలగుట ... ము కలిగింపకపోదు. భర్త జ్ఞాపకమువచ్చి మోహపరబుద్ధియుప్పొ... గదివిడచివెళ్ళక, వెనుక వినఁబడిన కేకకు లక్ష్యముంచక భ... వచ్చి యోదించుకొను చుండెగా నించుకమఱు... ... క్రిందిపై నొక పడవలో బ్రి యాణముచేసి యొక ... యున్న మనోహరమగు సౌధము నెక్కియచ్చట తన... భర్తను గాఢాలింగనముచేసినట్లుకల గని, యులికిపడిలేచి ... సౌధము భర్తమాయమగుటజూచి మ ఱింతచింతింపఁజొచ్చెను. మోహముమెచ్చి వికారములయినఁ బుట్టించును. శశికళయదికలగాగ్రహించి యిట్లుతలంచుకొన సాగెను. "దైవానుగ్రహ మునఁదిరిగి నేనుభర్తను గలిసికొనినంతనవంత ప్రణయకలహముచే నా హృదయమేసుసిముననునొప్పింపను. ఎప్పుడునుభగవంతునిగాఁతలంచి చేతులా

ర సేవజేసెదను. నాభాగ్యము, నాసంతానము, నాతలిదండ్రులు' నాభర్తతో సరిగావు. ఆయనలోనే నాకీలోకమున్నది. ఆయనచిరునవ్వే నాకు వేయిచంద్రులకాంతి" ఈతీరున నొంటరిగా గదిలోఁ దలపోసి యామోహ సాగరమీద సాగెను.

# మూడవ ప్రకరణము

"అమ్మాయి శశికళా,, యని తల్లి విభావతి కేక వేసెను. కాళీప్రసన్న బాబునకు శశికళ యొక్క తెయ [illegible] పుత్రులు లేరు. శశికళకుని ద్ద [illegible] పుత్రులును, ఇద్దరుకుమ [illegible] గలరు. వారందఱికి విభావతి కన్న చనువు. ఆమె మేనకూతురిక [illegible] సందెను. నారియా స్త్రియంతయు శశికళకే రానలసియున్న [illegible] ల్లుఁడగు జయగోపాలబాబు తన యూరువిడిచి యీ గ్రామమ [illegible] వారింటనే యుండెను. జయగోపాల బాబిల్లటపు టల్లుఁడై యత్తవారింటనున్నను' కాళీప్రసన్న బాబుగాని విభావతిగాని యాయనయం దణుమాత్రమైన, యలక్ష్యములేని గౌరవ ముఁజూపుచుండిరి. ఎంతో యెక్కువ యాస్తి భాగ్యములమునవన్నుచుం డుటజే రాజువలెఁ గాలముపుచ్చ వచ్చునని సంతోష మొందు చుండెను. భార్యాభర్త లన్యో [illegible] నురాగముకలవారు. దైవానుగ్రహమున సంతానవంతులు. ఎవ్వరి [illegible] లేక సుఖముగానుండిరి. కాళీప్రసన్న బాబు తనకుఁబుత్రిమే [illegible] ధానమని నమ్మి తనయాస్తిని జాగ్రత్తగా వృద్ధి చేసికొనుచున్నను ధర్మకార్యములకు వెనుకంజవేయువాఁడుకాఁడు అదిచిన్న గ్రామమైనను, అందలి బాలుర మూఢులగుదు రేమోయని యొకపాఠశాల పెట్టించి దానికై యొక భవనమునిర్మించి యిచ్చెను. జయగోపాల బాబుకూడ విద్యాభివృద్ధియం దభిలాష కలవాఁడై తనకుఁ

దోఁచినపుడెల్ల నచటికేఁగి యుపాధ్యాయులొనరించుపని విమర్శించుచుం డెను. ఐనను ఈతనియందు లోభగుణమున్నదని మామగారు గ్రహించి తదనంతరమున శశికళను ఒప్పించి యీవృథావ్యయ మేలనని పాఠశాలయెత్తివేయునేమోయని సంశయించి యాపాఠశాల శాశ్వతముగా జరుగుటకుఁ దగినభూవసతిని పట్టావ్రాసి రిజిష్టరుచేయించి యిచ్చివేసెను. పశ్చిమోత్తర తీరమున కాతిమొల్లని కాళీప్రసన్న బాబుకట్టించినవే. ఈపుణ్యాత్మునకుఁ బెక్కుతోటలుండుటచే నాయాఋతువులలోఁ బండెడు పండ్లలోఁగొన్నిటిని శ్రీరామ పురములోని, బీదలకిచ్చుచుండెడివాఁడు. శీతకాలము రాఁగానే శక్తిలేని వారికి కంబళులనుగొని పంచిపెట్టుచుండెడి వాఁడు. ఇంతటి మహోపకారి పురవాసుల యుపయోగార్థ మొక వైద్యశాలనుఁ బెట్టించుటమఱచిపోఁడుగదా. శ్రీరామపురమునకుఁ గావలసిన సదుపాయము లన్నిటినిఁ బూర్తిచేయుటకీ పుణ్యాత్ముఁడే కారకుఁడు. ఏకార్యముఁదలపెట్టినను సగముసొమ్మిమ్మ మహోత్సహించుచుండెను. ఈయనమంచితనముచే గ్రామములోనివారు తక్కినసొమ్ము పూర్తిచేసికొని యీయనచేతికిచ్చుచుండిరి. ఈయనయందు గ్రామములోనివారి కందఱకధిక గౌరవముండెనని వ్రాయఁబనిలేదు.

ఇంకవిభావతి నిరంతరముతన కుమార్తెబిడ్డల సంరక్షణలో మునిఁగియున్నను భర్తయందాదరము మఱచిపోలేదు. ఎంతపనియున్నను సరే వేళతప్పకుండఁ దనగృహమందు నీశాన్యమూల నిర్మింపఁబడియున్నయొకస్థలమందుఁ జక్కనిముగ్గులుంచి యిష్టదైవమునునిలిపి పూజలు సల్పుచుండును. ఇంటిలో నేర్పడిన యందఱి సేవకులకుఁ దగినపని నిర్ణయించుచు గృహమును పరిశుభ్రముగానుంచి భూలోకస్వర్గము సేయుచుండెను. చదువునేర్చిన యువతియగుటచే నాపురములోని బాలికల యుపయోగార్థమొక బాలికా పాఠశాల నిర్మించి, యదిశాశ్వతముగా నిలుచుటకై భర్తనేమియు నడుగక తనస్త్రీధనములోఁ జాలినంతయిచ్చి భూ

వసతియేర్పఱచెను. తానుతీఱికగలిగినపుడు పాఠశాలకుఁబోయి విద్యార్థినులకుఁ బాఠములు చెప్పుచుండును. తనమనుమలను మనుమరాండ్రను గృహమందే విద్యనేర్పుచు వేళకాఁగానే పాఠశాలలకుఁ బంపుచుండెను. పండుగలు వచ్చునపుడుగాని తనగృహములో వ్రతములు సలుపునపుడుగాని పుణ్యస్త్రీలను పేరంటమునకుఁ బిలుచునపుడు తనభాగ్య గర్వముఁ జూపకయుచితాలంకారములఁ ధరించి యొకమనుమరాలినిఁజంకఁబెట్టుకొని యూరిలోని నాలుగువీధులకుఁబోయి యాహ్వానము సేయుచుండును. తనయింటికివచ్చిన యువతులకు నాచారానుసారముగా గౌరవించి తాంబూలములిచ్చి పంపుచుండును. ఒక్కొకనాఁడు వారందఱుకూర్చుండినపుడు వారిస్వభాషలో వ్రాయఁబడిన గ్రంథములఁజదివి తాత్పర్యముబోధించుచుండును. శశికళయు విద్యయందుఁగాని యితరకాంతామణులకు గౌరవము సూపుటయందుఁగాని తల్లికిఁ దీసిపోవునది కాదు. ఆహా! ఆకుటుంబమెంత శ్లాఘాపాత్రముగానున్నది. ఆరీతి భాగ్యవంతులు మనగ్రామములలో లేకపోలేదు. వారిగ్రామములలోవారికే యెంతోయవసరమైనసదుపాయములనయినఁ జేయింపనిచ్ఛగింపని భాగ్యవంతులనెందఱినో యెఱుంగుదుము. భాగ్యము భగవంతుఁడొసఁగినందుకీరీతిగా యోగ్యవ్యయము సేయుచుండిననే యాభాగ్యము సార్థకమైనది. దేశోపయోగమునకై వినియోగింపని భాగ్యము భాగ్యముకాదు.

ఈరీతిగా సర్వజన శ్లాఘ్యులైన యీదంపతులకుఁ బుత్రుఁడు పుట్టలేదనియూరిలోనివారికున్నచింతలో గొంతయైన వీరనుభవింపకతమకుగలిగినపుత్రికతోనే తృప్తిఁగాంచియుండిరి. తండ్రియాస్తి తనకేవచ్చునని నమ్మియుండిన శశికళకు ముప్పదియేండ్లు వచ్చినతర్వాత సోదరుఁడు గలిగెనని వినినపుడు శశికళకు నాశ్చర్యము కలుగకపోలేదు. ఆశాభంగమగుటచే మనసు కలుక్కుమనకపోదని యితరులూహించినను, ఆమెయీసువార్తవినినపుడెట్లుండెనో కనిపెట్టశక్యముకాలేదు. తనభర్తకువిశేషముగా

నాఁడాయమువచ్చు నాస్తికలవాఁడు కాఁడు గనుకను, తానుచిన్నతనమునుండియు భాగ్యవంతులగు తలిదండ్రులయొద్దఁ బెరిగియుండిన సంతానవతియగుటచేతను ఈయాస్తివచ్చునుగదా యని భర్త వేఱొకవృత్తికింతవఱకు యత్నింపకుండుస్థితిలో హఠాత్తుగా నాశాభంగ మగుటచేతను తనభావిస్థితినిఁగురించి శశికళా హృదయమునవిచారముకలుగకపోలేదు. కాని మగబిడ్డకై వాచిపోయి యూరిలో నేయిల్లాలు మగబిడ్డ కనినను మిక్కిలి వేగముగాఁదనయున్నత స్థితినైనఁ బాటింపక పురిటింటికేగియా నూనెగుడ్డనుఁజూచి దూరముగానుండియే ముద్దుపెట్టుచు బాలింతరాలినినెంతో పుణ్యముఁజేసికొనిన దానవని మెచ్చుకొనుచున్న విభావతికి నేటికిమనోరథము పూర్తియైనదని సంతోషమొందెను. పుట్టింటి వంశాభివృద్ధికోరనియాఁడుది లోకములోనుండునా? పేదలకుఁ బుత్రులు కలిగినపుడు వారలపొందు సంతోషమునకంటె భాగ్యవంతులకు సుతులుకలిగినపుడు వారలొందుసంతోష మెక్కువగా నుండకపోదు. కుమారునికై వాచిపోయి వాచిపోయి తుదకునిరాశ చెందియున్న భాగ్యవంతులకుఁ గౌమారావస్థలోఁ బుత్రుఁడుపుట్టుటచే వారికెంతయేని యానందము కలుగుచుండును. లోకోపకారముసేయుచు సజ్జనులని పేరుగాంచిన యిటువంటి ధనికులయినవారికిఁ దనయుఁడుద్భవించుట మఱింతయానంద కరము. కాళీప్రసన్న బాబునకుఁ బుత్రుఁడుకలుగుటచే వారికిస్వభావముగాఁ గలుగునానందమునకంటెఁ దత్పురీ వాసులొందు సంతోషమునకు మితములేకుండెను. ఈబాలుఁడుదయించుటచే నూరిలోనివార లెన్నో యుత్సవములఁజేసిరి. కాంతికినిజమగు నధికారియగు సూర్యుఁ డుదయింపఁ గానే మెరుపు తెచ్చుకున్న కాంతితో నదివఱకు మిసమిసలాడిన చంద్రుఁడుకాంతిహీనుఁడైనట్లు జయగోపాలుఁడు తనభావ మఱఁది పుట్టుటకు వెలవెలపోవుచుండెను. తలిదండ్రుల హృదయారవిందములకు బాలభానూదయమువలె నీశిశువుండఁగా గుడ్లగూబకు సూర్యోదయమైనట్లు జయగోపా

లునకుండెను. ఈతనికదివఱకున్న యాశలను అభిప్రాయములను తీసికొని తన రెండుగుప్పిళ్లలోను బెట్టుకొనెనో యనునట్లు మూసికొనియున్న యాశిశువృనుకరములు పద్మకుట్మలములవలెఁ జెన్నువహింప జయగోపాలుండాశాభంగమొంది జీవనోపాయాన్వేషణమునకు యత్నింపసాగెను. దైవానుగ్రహమున కలిసివచ్చుటచే భార్యాపుత్రాదులను అత్తవారింటదిగవిడిచి తానొక్కఁడే 'అస్సాము,, ను దేశమునకుఁబోయెను ఇదియే శశికళా జయగోపాలురకు మొదటి యెడబాపు.

# నాలుగవ ప్రకరణము



చిరకాలమునకుఁ దనకుఁదమ్ముఁడుకలిగి పుట్టింటి వంశముభువిలో నిలుచుటకు వలనేర్పడుటచేతను ఈశిశువుమూలమునఁ దనభర్త దూరదేశమేగి యదివఱకెన్నఁడనుభవింపని వియోగపుబాధ కూర్చుటచేతను, శశికళకు మోదఖేదములు సమానముగానుండెను. కాని తెలివిగలదగుటచేఁ దనవిచారమును తల్లిగ్రహించి యెక్కడ చింతించునోయని భర్తయెడబాపుచే గలుగుచింతను లోనణఁగద్రొక్కి సోదరుఁడుపుట్టుటచేఁగలుగు తనసంతోషము కనుపర్చుచుండెను. ఇట్లుండఁగాఁ గాలవశమునఁదన కుమారుని ముద్దుముచ్చటలుతీరకయే తల్లిపరలోకమునకేగుట తటస్థమయ్యెను. నరుఁడెంత ధైర్యశాలియైనను, భాగ్యవంతుఁడైనను మఱియేమియైనను, తనకుండుసామర్థ్యము లెట్లుపయోగించినను, ఒక్కనిమిషమైనఁ దనయాయువు పొడుగించుకొనలేఁడుగదా? తల్లిమరణసమయమునఁ దన కుమారుని శశికళ చేతిలో నునిచి "వీనిభారమునీది,, యని యప్పగించి మరణించెను. ఆశిశువు తల్లిలేకుంగని వాఁడుగనుక నానాఁటికి సహజమగు ననుభవజ్ఞానము వచ్చుచున్నకొలఁదిసోదరినే తల్లిగాభావింపఁదొడంగె

ను. అట్లుగదా, మాతృహీనశిశువులు తమ్ముంబెంచినవారిపై మాతృప్రేమగలిగి యుండుట యాశ్చర్యముకాదు. ఈశిశువే తనభర్తకు దూరదేశముద్యోగమునకై పోవుటకుంగారణభూతుండయినను, తల్లితనచేతిలోం బెట్టినదిగనుకను, తానుసంతానవతియై పిల్లలయందలిప్రేమచవిచూచియున్నదిగనుకను, ఆసోదరునిఁ గడుజాగ్రత్తతో బెంచుకొనుచుండెను. తల్లి మరణించినవార్త భర్తకు శశికళపంపినది కాని యాతడు రాలేదు. కాళీప్రసన్నబాబు కుమారునియభివృద్ధి సంతోషదాయకమైనను, భార్యావియోగదుఃఖముచేం గృశింపక తీరినదికాదు. చిరకాలము వఱకు మగబిడ్డకై వాచి వాచి తుదకులభించినను చేతులారా బెంచుటకుం దనభార్యకు ప్రాప్తము లేకపోయినదనియు, పుత్రుని యభివృద్ధిచూచుకొని సంతోషమొందెడు ప్రాప్తి లేకపోయినదనియుం దలంచుకొని యొక్కొకసారి కన్నులనీరుపెట్టుకొనుచుండెడివాడు. ఎంతభాగ్యమున్నను భార్యావియోగదుఃఖము భరింపరానిదేగదా? అందులో మాతృహీనశిశువును గాంచిన తండ్రికి గుండెలు బ్రద్దలగుటలో వింతలేదు. శిశుప్రాణనాడుం బెరిగి తప్పటడుగులు పెట్టుచుండెను. చిన్నచిన్నమాటలు పలుకనేర్చెను, సోదరిని "జీజీ" అని పిలుచుచుండెను. మఱియొకప్పుడు "జీజీమా" యని పిలుచుచుండెడివాడు. తనపిల్లలప్పటప్పుడు పోట్లాడుచున్నను శశికళ శిశుపక్షమవలంబించి తనపిల్లలనే కూకలువేయుచుండెను. తల్లిలేనిపిల్లవాడుగనుక వానినేరమంతగాం బరిగణింపకుండెను. ఏదేనితినుబండారపు వస్తువున్న మొదల ముందుగా సోదరునికిం బెట్టి యాపైని తనబిడ్డలకుం బెట్టుచుండెను. ఈరీతిగా బాలుండు తన యప్పగారిప్రేమను చూఱగొనెను. ఈపిల్లవానికి రెండేండ్లవయసు వచ్చునప్పటికి పాపము కాళీప్రసన్నబాబునకుం దీర్ఘరోగమంకురించెను. భాగ్యవంతుడౌటచే ఘనవైద్యునిం జేసుకొనుచున్న పట్టణమునుండి రప్పించెను కాని కాలమాసన్నమైనవానికి నౌషధము లేమిపని సేయగలవు? పుచ్చుకొన్న యౌషధములదారి వేఱుగాను, రోగముత్రో

వషేలుగాను ఉన్నది. తుదకుబ్రతుకునన్న యాసలేదని వైద్యుఁడు తెలుపఁగానే తనభర్తనుతక్షణమురమ్మని యొకతంతివార్తపంపినది. భార్యయిచ్చినతంతివార్తనుఁజూచి జయగోపాలబాబు వెంటనేతనయుద్యోగము మానుకొని యయోమార్గమున వచ్చెను. ఈనడుమ రెండేండ్లలోను భార్యాభర్తలకు నుత్తరప్రత్యుత్తరములు జరుగకపోలేదు. భర్తపై మన సుపోయినపుడెల్లఁ దానూఱట నెందుటకై యీయుత్తరము లెంతేని స హాయపడినవి. భర్తరాఁగానే తమ్మునిఁజంకం బెట్టుకొని తక్కినతన సంతతిని వెంటఁబెట్టుకొని విచారవదనముతో భర్తకెదురేగినది. ప్రియభర్త వచ్చినపుడెల్లా లెట్లు మర్యాద లొనరించునో యట్లుసేయుటలో శశికళ యణుమాత్రము లోపముసేయలేదు. తండ్రికి వచ్చిపోయెడు ప్రాణము లోనున్న దుస్థితి తనమనసు వేచుచున్నను' భర్తయందలిప్రేమ మర్యాద లన్నియుఁ జేయఁబురికొల్పెను. జయగోపాలబాబు భార్యాదిబంధుచయమునుఁజూచి యూఱడించి మామగారున్న గదిలోనికిఁబోయి చూచెను. కాళీప్రసన్నబాబున కప్పటికి స్మారకముతప్పిపోలేదు. "నాయనా! నాకుమారుడు నీలమణిని నీయధీనముఁజేసితిని. తల్లియిదివఱకే వానిని శశికళ కప్పగించినది నేనునీపరము సేయుచున్నాను. కావున మీదంపతులిరువురు బాలుని వృద్ధిలోనికిఁదెచ్చుభారము వహింపుఁడ,, నికన్నీరుగార నప్పగించెను. ఆస్థితిలో జయగోపాలబాబు మాఱు పలుకక "చిత్తమ"ని నూత్రముపలికెను. తనయాస్తిలో మూఁడువంతులు తనపుత్రునకును నాల్గవవంతు శశికళకునుఁ జెందునట్లు మరణశాసనము వ్రాయించి యారాత్రియే కాళీప్రసన్నబాబు పరలోకమునకేగెను. ఊరిలోనివారందఱు ప్రతిగృహమున మరణముతటస్థించినట్లేడ్చిరి. ఆమహాత్ముని సుగుణపుంజములవేయి విధములఁ గొనియాడిరి. శవమువెంట నూరిలోని వారెల్లనేగిరి. గ్రామమున కంతకుఁ గాఢాంధకారము గ్రమ్మినట్లయ్యెను. జయగోపాలునకుఁగూడ దుఃఖమాఁగలేదు. నీలమణిపైఁ గన్నీళ్ళమూలిపి జయ

గోపాలుఁడే మామగారి యుత్తరక్రియలు జరిపెను. మొదటినాటి దుః ఖమును మఱునాటికిఁ దగ్గిపోవుట సహజముకావునఁ గాలక్రమమునదుః ఖము తగ్గుచుండెను.

## ఐదవ ప్రకరణము.



మామగారు గతించిన కొన్నిదినములవఱకు జయగోపాలుఁడొక రీతిగానుండెను. కానికాళీప్రసన్నుని దుఃఖమువెనుకపడి తగ్గుచుండగా నీలమణి పుట్టుటచేఁ దనకురావలసిన యంతయాస్తియుఁ బోయినదిగదా యనితలంచి యాబాలునసూయతోఁ జూడ మొదలు పెట్టెను, నాటి నుండి శశికళకు, జిక్కుదశ ప్రారంభమైనది. జయగోపాలుఁడుతనమనసు లోనే నీలమణిపై దనకుండునసూయత నణఁగఁద్రొక్కియుండెను. తలిదం డ్రులు గతించిన యానీలమణిపైఁ దనభర్తకా యనస్తలో నెంతప్రేమ యుండునో కనుఁగొనయత్నించి యొకనాఁడు భర్తభోజన మైనపిదపసా విటిలోఁ గూర్చుండి తాంబూలచర్వణ మొనరించువపుడిది మంచిసమ యమని శశికళ తమ్మునినెత్తుకొని యాబాలుడాడుముద్దు పలుకులకునవ్వు చుభర్తకడకువచ్చెను. నీలమణిసోదరీకంఠముకౌగలించియుండెను. భర్త చెంతకువచ్చి తమ్ముని బిలిచి “నీలమణీ! నీబావగారికి నీవిద్యచూపించు ము,,నినవ్వుచుబలికెను. దుష్టబుద్ధిగల బావగారిముఖమునుఁ జూడనిచ్చ గింపనట్లు నీలమణిముఖమటు త్రిప్పలేదు. ఐనను శశికళభర్తకుమఱింతద గ్గరగాబోయి “బావగారియొడిలోఁ గూర్చుండుము,,ని నీలమణిని బలవంత ముగాఁదనకౌగిలి వదల్చి కూర్చుండబెట్టబోయెను. బాలుఁడేడ్వ మొదలు పెట్టెను. పైకివల్లటిమసికుప్పవలెనుండి నిప్పురవ్వతగులగానె భగ్గునమండి పోయిన తుపాకీమందువలెజయగోపాలునిమనసులో నదివఱకణగియుండి

సేయసూయత• నీలమణియొడిలో గూర్చుండఁగా, నింకకంఠీఘాతముకాతే
క పైకివచ్చెను. "ఈదుర్మార్గునిమూలముననాయాసలన్నియుఁ గూలిపో
యినవ,, నిజయగోపాలుడుముఖము జేవురించుకొనిపలికె. శశికళకుగుం
డెలుకొట్టుకొనెను. నోటమాటరాలేదు. శరీరమువణక నారంభించెను.
ఆలోచన వేయివిధముల పోయె. నీలమణిని భుజముపై వేసికొనెను. భ
ర్తచూపిన యసూయతచేనింక బాలునకెప్పుడయినహాని కలుగనేమో
యనిసందేహించెను నీలమణికిఁ దాముతప్ప మఱియాధారము లేదని యె
ఱుంగును. భర్తకిష్టము లేనప్పుడెంతకాలము వీనినిదాఁపగలననితలంచె
ను ఐనను ధైర్యము తెచ్చుకొని భర్తతో "మనముతప్ప నీలమణికి నా
ధారము లేదుగదా. వీఁడు బాలుఁడు. దైవము మనకీయవలయును గాని
నీలమణిమూలమున మనకువచ్చెడి యాస్తిపోయినది గదాయనియెంచు
టన్యాయమా? మీరుహాస్యమున కిట్లన్నారు కాఁబోలు,, నని మృదువు
గాఁ బలికెను.

"ఛీ! ఛీ! ఎంతయాశాభంగమయినది. ఆకౌమారదశలో నీలమణిపు
ట్టకపోయినచో, వారికేమిలోపమా? ఈబాలుని మూలమున నేనిపుడు
ద్యోగము సేయవలసివచ్చినది,,

"ఒకరియాస్తికి నాసింపక మీప్రజ్ఞమీఁద నేనమిత్ర యాస్తి గడించు
టవలన ఖ్యాతివచ్చునుగదా? ఈరీతిగా మీరలసహ్యముఁజూపినను, అన
రానిమాటలాడినను మనకపఖ్యాతి రాఁగలదు,,

"అపఖ్యాతికి జంకువాడను కాను"

"మాతండ్రి నాలుగవ వంతాస్తి నాకిచ్చెనుకదా. అదిమీరుక్రమక్ర
మముగాన్యాయముగావృద్ధిచేసుకొనరాదా. నావంతుమీకొసంగెదను"

"నీవంతువలన రమారమి పదునైదువందల రూపాయిలు వచ్చును.
అంతామనకు రావలసినది పోయినది,,

"అదిగో, అట్టిమాట మనమనరాదు. మనమొకకోరిక కోరునపుడు,

మనలగుఱించి యితరులాగోరిక గోరిన మనకెట్లుండునో యోచించిరే
ని, యిట్లుమీరనరు,,

" నాయెదుటనుండి పొమ్ము,,

శశికళ యింకేమియు వచింపలేను. భర్తకసూయకలిగినది. ఈ బాలుఁడెట్లు బ్రతుకఁగలఁడు? ఆయనసాహసము కలవాఁడు. ఏమిసేయునో యని తనసోదరుని వేయిగన్నులఁ గనిపెట్టుచు క్షణమైన నేమరక కాపాడు చుండెను.

నీలమణి దేనికైన నేడ్చినేని జయగోపాలుఁడెంతో విసుగుకొనుచుండెను. భర్తకిష్టములేని పనియైనను నీలమణినిఁ బెంచుట తప్పినది కాదు. ఒక్కొక్కనాఁడు రాత్రి నీలమణి లేచి యేడ్వనారంభించెడివాఁడు వెంటనే తననిద్రచెడి పోవుచున్నదని చీదరపడుచు జయగోపాలబాబెంతో కసరుచుండెను. వెంటనే శశికళ లేచి చీకటియని భయపడక యాబాలునిఁ జంక బెట్టుకొని దొడ్డిలోనికిఁ గొంపోవుచు వానినోదార్చుచుండెను. భార్య యీరీతిగాఁ జేయుట జయగోపాలబాబునకిష్టములేదు. నీలమణినోదార్చుటకై భార్యయావలకుఁ బోయినపుడు చిన్నకుమారుని నిద్రనుండి లేపి యేడ్పించుచుండెను. బలవంతముగా భర్తకుర్రవానిని లేపి యేడ్పింపఁజొచ్చెనుగదా యని మనసునరోషపడుచు వేగముగావచ్చి వానినిఁగూడజంక బెట్టుకొని దొడ్డిలోకేగుచుండెను. ఇంతలో మఱియొకపిల్లను లేపెడివాడు. ఆహా! అసూయయెంతపని సేయుచున్నది! ఈరీతిగా భార్యను హింసించుచున్నను శశికళ శాంతముతో సహించియూరకుండెను కాని భర్తపై మనసులోనైన విసుగుకొనలేదు.

ఒకప్పుడు పిల్లలలో బిల్లలు పోట్లాడుచుండుట తటస్థపడెనేని జయగోపాలుడు నీలమణినిఁ గొట్టుచుండెడివాడు. భర్తరానపుడు శశికళ నీలమణి పక్షమవలంబించి తనపిల్లలనే కూకలువేయు చుండెడిది. తల్లిలేనివాడుగనుక వానిపక్షమవలంబించినను, జయగోపాలునియొద్ద నీస్థితిగ

మలుమాటి పెడల్లరి చేయునప్పుడు దెబ్బలు పడుచుండుట వింతలేదుగా
ని యెవ్వరల్లరి చేసినను నీలమణికి దెబ్బలు తప్పకుండుట కడుశోచనీయ
ము. నేరము నేర్పులేక పైగా విచారణలేక యూరక నీలమణికి దెబ్బలు
తగులు చుండుట వలన శశికళ హృదయమున నెంతయేని చింత పొందు
చు యుండెను. "అది న్యాయమా" యని భర్త నడుగక తప్పినది కా
దు. "అల్లరికి మూలము వాఁడే కనుఁబడినచోట తన్నవలసినదే" యనిజ
యగోపాలుఁడు ప్రత్యుత్తరమిచ్చునపుడు శశికళకనుల నీరు పెట్టుకొనిమా
తాపితృలు గతించినందువలనఁగదా నీలమణి కిటువంటి యవస్థ తటస్థమై
నదని చింతించుచుండెను. నిష్కారణముగా శిక్షనొంది బాలుఁడు వెక్కి
వెక్కి యేడ్చునపుడు శశికళ వానినిఁ దనగదిలోనికిఁగొంపోయి యేదైన చి
రుతిండి గాని యాటవస్తువులను గాని యొసఁగి యోదార్చు కొనుచుండె
ను. ఈరీతిగా శశికళ నీలమణిని బ్రోచుచుండినకొలఁది జయగోపాలునకు స
సహ్యము వృద్ధియగుచుండెను, తుదకు శశికళపై జయగోపాల బాబునకది
వఱకుండెడు ప్రేమయంతయు నీలమణి మూలమున క్షీణింపఁదొడఁగెను.
మనసులోఁగ్రోధము పెరుగుచున్న భర్తకడ భార్యచూపెడుశాంతమం
తయు వ్యర్థముకాఁజొచ్చెను.

## ఆఱవ ప్రకరణము.



ఈరీతిన చిక్కులుగా కాళీప్రసన్న బాబు కాలధర్మము నొందినత
రువాత నాలుగేండ్లుజరుగుటచే నీలమణికారేండ్లుగలవు. సూర్యుఁడుధను
ర్లగ్నము విడచి మకరమందు ప్రవేశింపఁబోవునప్పుడు దక్షిణహిందూ దే
శమందు గొప్పపండుగదినములు. ఆదినములలో గృహములను బాగుచే
సికొనుట. పండుగ దినములలో వీధులలో చక్కనిముగ్గులు పెట్టుట, అ

త్తవారిండ్లనుండి యాఁడువారు తమపుట్టిండ్లకువచ్చుట, అల్లుండ్రను బిలుచుకొనివచ్చుట, వారికిశక్త్యనుసారముగానూతనవస్త్రములిచ్చి గౌరవించుట, మొదలగునవి యాపండుగ దినములలోఁ జరుగును. అందుమొదటి దినమునకు భోగిపండుగ యనిపేరు. ఆనాఁడుమున పాంతములందు జిన్నపిల్లలనలంకరించి యొకయాసనముపైఁగూర్చుండఁబెట్టి యాబాలునిలేక బాలిక తలపై ఫలములును నాణెములనుకలిపి భోగిపండ్లుపోయుదురు. అతిసుననే బంగాళాదేశములోఁగూడ నిట్లు సోదరులను సోదరిగౌరవించును. ఆయాచారానుసారముగాఁ గార్తికమాసమందు నీలమణిశశికళలంటి స్నానముచేయించి విలువగలవస్త్రముల బహుమతినొసంగి కట్టబెట్టి ఫలములను నాణెములను పైనిఁబోసెను. ఈవేఁడుకను విలోకించుటకు శశికళయూరిలోని పుణ్యస్త్రీలను పేరంటమునకు నాహ్వానము చేసెను. కుమ్మరించిన ఫలములను నాణెములను వచ్చిన పేరంటాండ్రలోఁ గొందఱేఱుకొనిరి. ఆవచ్చినవారిలో తారకూడకలదు. శశికళవారిసంపత్తిని చితరీతి సుగంధద్రవ్యములు మొదలగునవియిచ్చి తాంబూలములిచ్చునపుడు. తార శశికళతో "రహస్యముగా నీలమణిమూర్తి యపహరింపఁదలఁచి పైకినీపీరీతిగా గౌరవముచూపుట వింతగానున్నద,, నిపలికెను. ఆమాటకఁఆకయిన బాణమునాటినట్లు శశికళకు తగిలి దేహమువణకనారంభించి నిశ్చేష్టమైనిలిచెను. కనులనీరు గ్రమ్మనారంభించెను. హృదయము చలించెను. అంతయువిలోకించి తార "ఏమమ్మా శశికళగారూ? అట్లు చూచెదరేమి? మీదంపతులిరువురు నీలమణిమూర్తి యపహరింపఁదలంచుటచేతనే దొరతనమువారికిఁ జెల్లించవలసిన పన్ను సకాలమునకుఁ జెల్లింపక నిష్కారణముగా జప్తుచేయించి భూముల వేలము వేయించి నీభర్త సోదరునిపేర గొనుట యెవ్వరెఱుంగరు,, నిపలికెను. ఆమాట శశికళ కెంతకఠినముగా నుండెనో చదువరులూహింప వలయును. అట్లుజరిగెనని శశికళయెఱుంగదు, కేవలమసత్యమనినమ్మెను. తనభర్తవ్యవహార

ముసంము నీలమణికి నష్టము సేయుఁడని నమ్మకము. అందుచే "ఈయుపనిం దఁబన్నినవారి నోటఁబురువులుపడవా?" యని కోపముతోఁగఠినముగాఁ బలికెను. శశికళ యీయంశమునుగూర్చి భర్తనడుగ నువ్విళ్లూరుచుండె ను. వచ్చినపేరటాండ్రఁబంపి భర్తనుగాంచి సంగతినివేదించెను.

"నిజమైయుండును. మాసోదరుఁడంత నీతితప్పినవాఁడు కాఁడు. తిరిగి మా భూమి మనకీయకపోఁడు. శిస్తుచెల్లింప వలసినకాలము మించినపుడు దొంతనము వా రూఱకుందురా?"

"మీరేల సకాలమునకుఁ జెల్లింపలేదు?

"నాకిదియే పనియా?

"మనలనమ్ముకొనిన బాలునకు మోసమురాదా?

"రానిమ్ము' నాకేమి?

"న్యాయము కాదు' మీ సోదరునడిగి యాయన వెచ్చఁబెట్టిన సొమ్మిచ్చి భూములుతిరిగి నీలమణిపేర వ్రాయించుఁడు. లేనియెడల మనమప కీర్తిపాలగుదుము.

"వాఁడిప్పుడిచ్చునా? ఇతరులకుఁబోవుటకంటె మనబంధువర్గములోని వాఁడనుభవింపఁజూచి మోదింపరాదా?

"నాథా! మనభూముల నితరులట్లుసేసిన సహింతురా?

"ఇప్పుడు మించినదానికేమిసేతును?

"ఆయన న్యాయముగా నీయనియెడల వ్యాజ్యమువేసి నీలమణి యాస్తి నిలుపుఁడు.

"నాసోదరునిపై వ్యాజ్యమువేయుట ధర్మమా? కాక మనమెట్లుగెలువఁగలము? కర్చులుదండుగ.

శశికళ యింక మాఱుపలుకక తనగదిలోనికిఁబోయి యిట్లుచింతింపసాగెను. "నాభర్త స్వార్థపరత్వమూని నిష్కారణము సోదరుని యాస్తిపాలుచేయుచున్నవారు, భర్తదైవముగదాయని యాయనమార్గము

నే త్రొక్కినయెడల నాతలిదండ్రు లింతీదానినిఁజేసి చేతులారనాకప్పగిం చిన నూరెళ్లుఁగని బాలుని ద్రోహముచేయవలసి వచ్చును. ఏమిచేయు దును? మగనియాజ్ఞ మీఱుదునా? యాజ్ఞలకులోఁగి సోదరుని హానిచే యుదునా? హాదైవమా? నాకంతయు నేఁడిదికిఁ దెచ్చితివి? భర్తయు నా పైఁ బూర్వపుటనురాగముఁ జూపుచుండుటలేదు. నీలమణి దిక్కుమాలి నవాఁడు? నేనుసంతానవతిని, నీలమణికిఁ జేసెడిద్రోహము నన్నును నాపి ల్లలనుఁజుట్టుకొనదా? భర్తతలంచినదానికి భిన్నముగా నడుచునంటి నేని నదియును హానికరమే? ఏమిచేయుదును? అయ్యయ్యో! సాలునకుపదిహే నువేల రూప్యములువచ్చు భూమి నిష్కారణముగా కాఱితమైనది. భ ర్తయవ్యవహారము సరిగాఁజూడదు. నేనాఁడుదానను, కలెక్టరువారినద్దకు వె ళ్లి చరిత్రయంతయు నివేదింప నాకుధైర్యములేదు. కానిస్తుతియుంభా ర్యపేరనొక లేఖవ్రాసెదను. అదిపనిసేయుచుండునా? ఈమూఁడు వచ్చెడి నెలలోభార్యాభర్తలు వచ్చెదరని చెప్పుకొనుచున్నారు. ఈమాసముగ డుచుటకింక రమారమియిరువదిదినములున్నవి. కానిమ్ము, ఈగ్రామము నకు వచ్చినతరువాత నధికారిభార్యను కలుసుకొనియెద,, ననితలంచెను.

ఇట్లుండ నొకనాఁటిరాత్రి నీలమణికి జ్వరమువచ్చెను. పలవరింతలు, కనులవిప్పఁడు. చేయివేసిన చుఱ్ఱుని కాలుచున్నది. తెల్లవారినదాఁక శశి కళకునిద్రలేదు. జయగోపాలుఁడుచూచి "యింకవీఁడుబ్రతుకుట దుర్లభ ము,, వెను. "వైద్యునకుఁగాని మనకెట్లుతెలియును. వెంటనే వైద్యునిఁబి లువుఁడు. ఈపాటియుపకారముసేయుఁడ,, ని భర్తను వేడెను. ఏవైద్యుఁ డును బ్రతికింపలేఁడనిపలుకుచు నొక్కనికేకవేసికొనివచ్చెను. వైద్యుఁడు రోగినిపరీక్షించెను. జయగోపాలుఁడు "అయ్యా! ఇదిసాధ్యమా,, యని వైద్యునడిగెను. వాఁడు "దుర్లభమనుకొనియెద. అనుగ్రవానిబాధలుఁబె ట్టియుంచుకుమిలింగఁజేయుటకంటె నింకనెమ్మదిగాఁ జావనిచ్చుటమేలు,' ని ప లికెను. శశికళ "యిదిపెద్దలు పన్నినపన్నాగము, దైవమేమాధారము,'

ని తలంచుకొని యూరకున్నది. మంచముపైనుండి చాపమీఁదఁ బరుం డఁబెట్టెదమని జయగోపాలుఁడు తలంచెను. శశికళ "అట్లు సేయఁ దగదు కాలుసేతులు వెచ్చగా నున్నవి. జ్వరము తీవ్రముగా నుండెనే కాని శ్వాస మొదలగు మరణచిహ్నములు లేవు. భాగ్యసంపదలో జనియించిన కుఱ్ఱ వాని నిష్కారణముగా నేల భూశయనము సేసెదరు? వద్దువద్దు" ని బ్రతి మాలెను. ఇంతలో తెల్లవాఱెను. వైద్యుఁడు వెడలిపోయెను జ్వరమించు కతగ్గలేదు. ఆ వైద్యుఁడు భర్త చేసిన కుట్రలోఁ జేరెనని యనుమానించి యాతని మాత్ర వేయలేదు. జయగోపాలబాబు వైద్యునిఁ దెచ్చినప్పుడు వారిద్దఱు నీలమణినిఁ జంపెడు మార్గము మాట్లాడిరి. శశికళ భర్తపాద ములపైఁబడి యిట్లు పలికె "నీలమణి జ్వరము తగ్గలేదు. పట్టణమునుండి ఘన వైద్యుని రప్పింపుఁడు?

"ఆయువున్నచో నేమాత్రయు నఁబనిసేయును. లేనపుడు పట్టణవా సియగు వైద్యుఁడాయువు పోయఁగలఁడా? ఎక్కువ సొమ్ము పుచ్చుకొనక మానఁడు?

"నాకంఠసైన నిచ్చెద పిలుపింపుఁడు.

"యీ వైద్యునే మఱలఁబిలిచెదను?

"వద్దువద్దు వానిచేతఁగాదు.

రెండుజాములయినది శశికళ తమ్మునిఁగనిపెట్టియుండెను. ఒక్క నీటిబొట్టయిన త్రాగలేదు విచారించుచుండెను. భార్యనుగాంచి "పట్టణ మునకుఁబోయి వైద్యునిఁదెచ్చెదన,, ని జయగోపాలుఁడొక గుఱ్ఱపుబం డినిఁగట్టించుకొని వెళ్లెను. గంపెడాసతో వైద్యునిరాకనిరీక్షించియుండె ను. సాయంత్రమైనది. చీఁకటి పడినది. జామురాత్రి యైనది. గడియా రము తొమ్మిది కొట్టినది. ఇంతరాత్రియైన నింకరాలేదు. తనకుఁ దోఁచిన మందేదో వేయుచుండె వైద్యుఁడు వచ్చుచుండెనేమోయని పలుమా ఱు గుమ్మములోనికి వెళ్ళి చూచుచు వెంటనే తమ్మునిదగ్గఱ వచ్చుచుం

డెను. భోజనము సేయలేదు. ఇరుగుపొరుగు వారలువచ్చి చూచి వెళ్ళు చుండిరి. రాత్రి తొమ్మిదిన్నర యగునప్పటికి గుఱ్ఱపుడెక్కలు చప్పుడు వినబడెను. శశికళకు నీలమణి రోగముపోయినంత యుత్సాహము కలిగెను. గదిలోనిదీపమును మఱింత యెగసన ద్రోసెను. మర్యాదకు లోపము లేకుండ నిలిచియుండి వైద్యుని రాకవేచియుండెను. బండిగుమ్మము ముం దాగినది, బండిలోనుండి దిగుచప్పుడు వినబడినది. ఆనిమిషము వేయేండ్లయ్యెను. శశికళతొంగిచూచెను. జయగోపాలుడు తనగదిలోనికి బోయెను. శశికళ తల్లడిల్లెను. జయగోపాలుడు కొంత సేపటికి నీలమణి గదిలోనికివచ్చెను. దూరముగానిలిచి ఎట్లున్నది అని యడిగెను. "అట్లే యున్నది. దాహమారంభమైనది. వైద్యుడేడీ?,, "పట్టణమందు లేడు,, శశికళకింక నెట్లుండును? భర్త మోసముచేసెనని మఱింతదృఢముగా నిశ్చయించెను. "నేనుతొందరమైన రాచకార్యము మీద దూరముగా బోవలయును. రెండు మూడు దినములలో వత్తును. మనయూరు వైద్యుడువచ్చి చూచుచుండును నేనుపైనముమానుకొనవలనుపడదు,, అని జయగోపాలుడు పలికి వెంటనేబయలుదేరి వెడలిపోయెను.

## ఏడవ ప్రకరణము.



ఔరా! జయగోపాలా! ఎంతద్రోహము తలచితివి? తల్లిదండ్రులులేనిబాలుడు చావుబ్రతుకులమీదనుండగా బట్టణమునుండి వైద్యుని రప్పించుట యటుండగా బైలుగానాడుదాని నింట దిగవిడిచి పొరుగూరికేగితివిగా? విన్నవారికే జయగోపాలునిచర్య బాగుగాలేదు. ఇంకశశికళ కెట్లుండునో వ్రాయబనిలేదు. తమ్ముడుజీవింపడనియు భర్తకునన పైనాగ్రహము కలిగెననియు తలంచుకొని కుందుచుండెను. ఎట్లో తెల్లవాఱినది. సూర్యుడుదయించెను. స్థితిగతులన్నియు యోచింపదొడగెను.

ఎన్ని చిక్కులు పడినను సరే తమ్ముని బ్రతికించుట యుక్త కార్యమని నిశ్చయించినది. వెంటనే సేవకునిఁ బిలిచి యొక పడవవానిని రప్పించెను. కేవ్వు నిర్ణయించుకొనినది వెంటనే తనపిల్లల నింటిలోనున్న సేవకుల కప్పగించి యిరుగు పొరుగు వారలకు నప్పచెప్పి కొంచెము వయసు వచ్చిన పెద్దకుమార్తెకు ధైర్యము చెప్పి తనతమ్ముని వెంటబెట్టుకొని యాపడవ నెక్కి పట్టణమునకేగెను. ఒక గౌరవనీయురాలింట బసదిగి యామె సేవకులచే వైద్యునకు వర్తమానమంపినది. వైద్యుఁడు పట్టణమందేయుండెను. నిన్నటి దినముఁ గూడ నచ్చటనే యుండెను. జయగోపాలుఁడాయనకొఱకై రాలేదని తెలిసెను. భర్త చేసిన మోసమునకై పొందుచుంతకంటెఁ దమ్ముని నైపడుచిన చిక్కటమగులచే వైద్యుని పాదముల పైఁబడవేసెను. అతడు రోగిని నిదానించి మూత్రాదుల పరీక్షించి యౌషధమొసఁగెను. రోగము తకుమనారంభించెను మఱునాఁడే జయగోపాలుఁడు వచ్చెను.

భార్యాపట్టణమునకుఁ బోవుటవినినంతనే తాటికాయలంతటి గ్రుడ్లు పెట్టుకొని కంటఁబడినంత బ్రింగివేయునంతటి కోపము తెచ్చుకొని పదఘట్టనచేయుచు మండిపడి సేవకునిఁ బిలిచి తక్షణమే యింటికి రమ్మనుమని భార్యకు వర్తమానము చేసెను. వైద్యుఁడు మందీయనారంభించెను. గుణమిచ్చుచుండెను. మఱునాఁడే తీవ్రమైన వర్తమానము భర్తపంపిన సేవకునివలన సంగతియెఱింగి "వచ్చుచున్నాను. ఇంకొకపూట తమ్ముని బ్రతుకఁజూచి వచ్చెదన" నిబలికెను. "వెంటనే రాలేదు గనుక నిది రెండవ వర్తమానము. ఇపుడు రాని యెడల నింకనెన్నఁడును నాయింటికి రాఁగూడద" ని కఠినముగా వర్తమానము చేసెను. ఎంతపగ సాధించుచున్నవాఁడు భర్తకు నాగ్రహము వచ్చినదిగనుక నింకనేమైనసరే వెంటనే బయలుదేరనిశ్చయించినది. ఇంతలో వైద్యుఁడు వచ్చి సంగతి వినెను. "ఈ యొక్కదినము నేను చెంతనే యుండవలెను; కావున నేను వెళ్లుటకు వల్లలేద"ని వైద్యుఁడు పలికెను. యేమైనసరే యని తమ్ముని రక్షించుటయే యుక్తమని తో

చెను. జయగోపాలుఁ డన్నిటొ ద్రిక్కనక్రోతితయై యింట నుండెను. దూర గ్రామమునందున్న కాళీప్రసన్నబాబు భూములన్నియు శ్రీరామపుర భూములను మేడయు జయగోపాలుని పేర దొరతనము వారి లెక్కలలో వ్రాయఁబడియెనని ప్రస్తావములో దెలిసెను. నీలమణికి, బతికినను తలదాఁచుకొనుటకయినను కొంపలేదు. ఆస్తియంతయు జయగోపాలుని వశమై వారి పేర లెక్కలలో వ్రాయఁబడియుండె. డిప్యూటీకలెక్టరుగారి భార్యాదర్శనము చేయనిశ్చయించినది. రాచకీయవ్యాపారములోఁ దానెట్లు ప్రవేశింపగలనాయని పాపము నీలమణి తల్లడిల్ల సాగెను ఏమి చేయఁగలను? తాను తమ్ముని రక్షించుట న్యాయమైనపని యని నమ్మకము కలిగిన నారీమణి యగుటచే దానక్కడ నున్నపుడే యక్రమమైన యీ రాచకార్యము న్యాయమార్గమెట్లు ద్రొక్కింతునో యని చింతిల్లుచుండెను. తుదకుమఱునాడుకలెక్టరుగారి భార్యకడకేగి వృత్తాంతమంతయు నివేదించెను ఆయుద్యోగీయుని భార్యయు జయగోపాలబాబు చర్యకు స్తంభితపడి శశికళార్తికి వగచి నీలమణికి గలిగిన యన్యాయమునకు వింతపడి, తాఁదివఱకు భర్తతో రాచకార్య విషయములగూర్చి ప్రసంగింపనిదయ్యు సాహసించి భర్తతో సర్వము నివేదించి న్యాయము చేయుఁడని కోరెను.

ఆకలెక్టరు పదవియందున్న తారణిబాబుగారు భార్య నివేదించిన యంశమునుఁ గూర్చి యోచించి చిరాకుపడి "శశికళ పరువుగల కుటుంబములోని దయ్యు నిల్లుభర్తపై నభియోగమునకు సిద్ధపడుట యాశ్చర్యముగానున్నద" ని పలికి యంతతో నూఱకొనక తక్షణమే జయగోపాలబాబునకు నుత్తరము వ్రాసి యందులో "నీ భార్యను వెంటనే యింటికిఁ గొనిపొమ్మ"ని వ్రాసెను- జయగోపాలునకు తారణిబాబునకు ప్రాణస్నేహము. తారణిబాబు వ్రాసిన లేఖనందుకొని జయగోపాలుఁ డాగ్రహించి యొక పడవనుఁ గుదుర్చుకొని భార్యకడకేగి శశికళను నీలమణిని శ్రీరామపురమునకు గొనివచ్చెను- తానుజేసిన మోసము బయలుపడెననియు,

భార్య తమ్మునిపక్షమూనియున్నదనియు జయగోపాల బాబునకు సందేహము కలుగకపోలేదు.

తమ్మునిపక్షము శిక్షకు వహించుటలో న్యాయమున్నదని జయగోపాలుఁడు తలఁపకపోలేదు. ఈభార్యాభర్తలకు రెండవసారి వియోగదశ వచ్చి తిరిగి కలుసుకొనిరి. భార్యయవలంబించినపక్షము న్యాయమయినదని యొప్పుకొనినవాఁడయ్యు తనకువ్యతిరేకముగాఁ దిరిగినదానిచేత నీసారి వారియుభయులకును మనసులలో నాగ్రహముఁ బుట్టియున్నది కావున నీసారి నిష్కల్మషముగా సంసారము నడుచుటలేదు. భర్తృసంరక్షణాయుము శిక్షకు నిర్లిప్తంతగానుండి భార్యయై భర్తకు జేయవలసినంత సంరక్షణ సేయుచుండుటలో లోపమేమియు లేదు. తమ్మునిపక్షమూనినదని తప్ప నితరాంశములయందు భార్యయందు లోపములేదని యూహించును ఎట్లుగును. కంటగింపుతో నీలమణి తిరిగి నిరామయుఁడగుటకు జయగోపాలుఁడు సహింపకపోలేదు. ఆహా! ధనాశ యెంతపని చేయుచున్నది? అశయొక్కటి మనసులోఁ జేరినయెడల నుండెడువాలలో నెక్కడ యుప్పరాయునిపడి విరిగిపోయినట్టులు సుగుణసంపద యంతయుఁ జెడిపోవునుగదా. నీలమణి తన మేనల్లుండ్రను, మేనకోడండ్రను గలిసి యాడుకొనుచు సంతోషములో నుండెనేగాని తనయాస్తికి సంభవించిన భంగపాటునుఁగూర్చి యిసుమంతయు నెఱుంగఁడయ్యె.

## ఎనిదవ ప్రకరణము



తారిణీబాబునకు స్థానచలనముకలిగి దేవీప్రసన్నబాబు కలెక్టరుగా నియమింపఁబడెనని ప్రచురమయ్యెను, తారిణీబాబు బదలాయింపఁబడెను [illegible]గానే జయగోపాలబాబు దిగులొందనారంభించెను. తానుచే

సినపని యెచ్చటవెల్లడియగునోయనియు క్రొత్తగావచ్చిన కలెక్టరుమో సమెఱింగి తిరిగినీలమణిపేర లెక్కలలో వ్రాయునేమోయనియు భయ పడుచుండెను. ఆస్తిపోయినమాట యటుండ తాను లంచమిచ్చి వెనుక టి కాగితములాయా యుద్యోగియులచే దిద్దించిన యంశము వెల్లడి య య్యెనేని దననడతకు భంగముకలిగి కారాగృహవాసము ప్రాప్తించునే మోయని విచారించుచుండెను. జయగోపాలుఁడింత యన్యాయము చే సినను ప్రజలలో నెవ్వఁడును ఆయన్యాయమునుఁగూర్చి యధికారులకుఁ దెల్పసాహసింపఁడని జయగోపాలునకు నమ్మకముకలదు. క్రొత్తగా వచ్చి న కలెక్టరు శశికళకుఁ దల్లి వైపు బంధువుఁడు. శశికళపదియేండ్ల యీడు గలకన్యయైయున్నపుడొకసారి తనబంధువురాలయిన విభావతినిఁ జూచు టకువచ్చెను. బంధుత్వము తెలిసికొని వరసకు "అన్న,, యగుట చేనెంతో ప్రేమతో "అన్నయ్యా,, యని శశికళ దేవీప్రసన్న బాబునుఁ బిలుచుచుం డెను- ఆతఁడును మిక్కిలిప్రేమతో శశికళనునాదరించుఁచు బదిదినము లుండెను- మఱికొంతకాలమునకు శశికళకు వివాహమై సంతానవతియై నతరువాత దేవీప్రసన్నబాబు కలెక్టరుపదవికె వచ్చెనని తల్లియగు విభా వతిపేర వచ్చినజాబును శశికళయుఁజూచి చిన్నతనమందుఁదన్నునాదరిం చినవాఁడనియెఱింగెను- ఈబంధుత్వము జయగోపాలబాబు కించిత్తు నె ఱుంగఁడు- తనబంధువుఁడేయాభాగమునకుకలెక్టరుగావచ్చెనని శశికళయె ఱింగి యింకఁదనతమ్మునకు న్యాయము కలుగునని గంపెడాసతో నువ్వి ళ్లూరుచుండెను. ఈబంధుత్వము భర్తకుఁదెల్పలేదు-

శశికళ సాహసికురాలనియు' తమ్మునిపక్షమూనియుండుటచే దేవీప్ర సన్నబాబునకు భార్యాధారమునఁజెప్పింపక పోదనియు, అందుచేఁ దనకవ మానము రాఁగలదనియు వేయివిధముల యోచించుచుండెను- ధనాశక లిగినతరువాత నెంతదారుణకార్యములనైనఁ జేయసాహసము కలిగించు ను- నీలమణినిఁజంపినయెడల నింకఁదనభార్య తనకు వ్యతిరేకముగా బని

సేయదని నిశ్చయించెను- కానిత్తఃప్రయత్నము నెగ్గునను నాసమాత్రము జయగోపాలబాబునకులేదు- తారుణిబాబు వ్రాసిన జాబుపైని పట్టణమునుండి తన్నును తనసోదరుని తీసుకొనివచ్చి నప్పటినుండి తనకుఁగాని తనసోదరునకుగాని మరణము తనభర్తచేతిలో నున్నదని శశికళనమ్మెను- శశికళ ధైర్యమేమోగాని యాజంతు కొంతయైనను లేనట్టు చరియించును నాఁడుపిల్లి తనపిల్లలను గ్రంథుహరింపకుండ వేయిగన్నులఁజూచునట్లు శశికళతమ్మునిఁ గనిపెట్టుచుండెను- అందుచే నర్ధరాత్రమునందయిన జయగోపాలుఁడు నీలమణినిఁ గడతేర్ప లేకపోయెను- శశికళ నిద్రమానినదనే నమ్మవచ్చును. ఈమెకు నిద్రాదేవి లొంగినట్లుతోఁచుచున్నది. భర్తవిహారార్థము వెడలునపుడు నిద్రించును- జయగోపాలుఁ డింటికిరాకమునుపే మేలుకొనును- ఆహా! తమ్ముని నిమిత్తమాయిల్లాలెంత శ్రమపడుచున్నది! ఒకనాఁడు మధ్యాహ్నము జయగోపాలుఁ డునిద్రించి లేచి భార్యయందిచ్చవిడిచియము నములుచు సల్లాపముగా నీక్రింది ప్రసంగము గావించెను-

"పాపము నీకుమరణము దాపైనది,,

"(నిగులుపడి) ఈజ్యోతిషమెప్పుడు నేర్చితిరి?

"నాకుఁదెలియును. నీకునా చేతిలోనే మరణము?

"ఆహా! ఎంతధన్యురాలను! దైవమగు భర్త యీపాడు శరీరము విడుదలసేయునపుడు సంతోషింపని సతియుండునా?

"అపుడునీతమ్ముని గతియేమి?

"నాపిల్లలకేమిగతియో నాతమ్మునికిఁగూడనదియేగతి. అందఱకుమీరేదిక్కు?

"నన్ను నీతమ్ముని నాచేతిలో విడిచెదవా?

"విడుతును?

"నీవుజీవింపవే? ఎట్లువిడుతువు?

"నా హృదయము మీలోనఁ జేరును? అప్పుడు నాతమ్మునికేమి భయము?

ఇట్టిరీతిగా సల్లాపము ముగిసినతరువాత విహారార్థము జయగోపాలుఁ డేగెను. శశికళ యీసల్లాపము వినోదార్థముగా నెంచక తన్నుఁ జంపుటకే నిశ్చయించుకొనెనని తలంచెను. మత్సరగ్రస్తుఁ డగుటచేఁ దనమరణానంతరము నీలమణిని గూడ నంతమొందింపక పోఁడని నిశ్చయించెను. కావున నికార్యము మిగులకమునుపే నీలమణిని దేవీప్రసన్నబాబునకే వశము చేసిన యుక్తముగ నుండునని భావించెను. ఈనష్టదినములింత యలజడితో గడుపుచున్నను సమయము తటస్థమగునపుడెల్ల భర్తను సామవాక్యములతో హితబోధ సేయుచున్నపుడు భార్య పలికినదానికి సమాధానములు లేక తరువాత వెనుకటి మత్సరము దయింప నీలమణిపై ననూయాగ్రస్తుఁ డగుచుండెను. తనస్నేహితుని కడకుఁ బోయి క్రొత్తగా వచ్చిన యుద్యోగీయునిచే దనకెట్టిచిక్కు గలుగునో దానినిఁ దప్పించుకొను మార్గమేదియో యోచించుకొనుచుండెను, జయగోపాలునకు యోచనతోను శశికళకు మనోవ్యథతోను కొన్ని దినములు గడచెనుగాని, భార్యను చంపుదమన్న యుద్దేశము గలిగినను దూరమాలోచించి వెంటనే యాపని నిర్వహింపక యూరకుండెను. దేవీప్రసన్నబాబు శ్రీరామపురములో బసచేయుదు మన్న దినము పూర్ణంబడెనని తెలిసి శశికళ మత్యంత చింతాపఁజొచ్చెను. దైవమే శరణమని నమ్మి కాలముగడుపుచుండెను.

## తొమ్మిదవ ప్రకరణము.



జయగోపాలబాబు తనమిత్రుని యింటంజరుగు నొకశుభకార్యమునకై యాహ్వానము రాఁగా మిత్రుఁడున్న యూరునకుఁ బోయె. భార్యతోఁ దానెప్పటికేగునో చెప్పక పరిచారకునితో మాత్రము చెప్పిపోయె.

ను. శశికళ తనకుసంభవించిన యీచిక్కునకేమి చేయుటకును దోఁపకున్నది. కష్టమ్ము నూహింపలేక పాపమాశశికళ తాను మరణమొంది సీలమణితల్లి జీవించియుండిన నెంతో బాగుగా నుండియుండుసని తలంచు కొనియుండెను. ఒకనాఁటిరాత్రి తనసోదరుఁడు తనబిడ్డలు నిద్రించినతరువాత తనస్థితి జ్ఞప్తికిరాగా నెంతో యోచించుచు నెంతకునిద్రపోలేదు. కోడి కూతవేళనిద్రపట్టుటచే మఱునాఁడు సరియైనవేళకు లేవలేదు. నాఁడుకొంచము వాప్రెక్కెను. కన్నులెఱ్ఱబాఱియున్నవి. నీరసముగానుండెను. ముఖమునందు వికాసము లేదు. దొడ్డిలోనియుడుగుపైఁ గూర్చుండి దంతధావనము చేసికొనుచుండ నొకపరిజనుఁడువచ్చి వీధి తలుపునకొక యచ్చుకాకితమంటింపఁబడియున్నదని చెప్పెను. దానినిఁదడిపి జాగ్రత్తగానూడదీసి తెమ్మని వాని కాజ్ఞాపింప వాఁడట్లొనరించెను. అదిహూణభాషలో నున్నదెయొక ప్రకటన. శశికళ హూణభాషలో పరిచయ మేదియు నియలేదు. కాని యిప్పటి ప్రవేశ తరగతిలోఁజదువుచున్న మనబాలురకుండునంతటి హూణభాషాపరిచయ మామెకుఁగలదు. ఆమె యాప్రకటనఁ జదువుకొనెను. అందలిసారాంశ మేమనఁగా:— పదిలక్షలరూపాయిల విలువకుమించిన రెండుగ్రామములు, మూఁడుదివ్యసౌధములు, కొంతనగదు, నాలుగుగుఱ్ఱములుబండ్లు, ఒకపనసులాటరీవేయఁబడుననియు, చీటికి రు 100లువిలువయనియు, లాటరీ నిఁగలుపున్నెయదినము నాఁటికి మూఁడుదినములుండెననియు తెలియుచున్నది. ఆపత్రికలనమీఁదనొకపక్కను సిరాతో "దీనిచీటులమ్మువాఁడు శ్రీరామపుర పాంథశాలలో నాఁడుపదిగంటలవఱకుమాత్రముండుననియుకొనఁదలఁచువారుకొనవచ్చుననియు వ్రాయబడియున్నది. శశికళ యాప్రకటన చదువునపుడు "లాటరీ" యనుమాటలు వినంబడుటచేఁబెద్దవాఁడు, "పురములోనిఁగొందఱుసంఘములుగాఁజేరి తలకొకపది యైదువందలున సొమ్ముపూఁడిచి పది చీట్లనుకొన్నార"నివిన్నవించెను. శశికళ చప్పుచప్పున ముఖమార్జనచేసి యద్దముకడకేగి బొట్టుధ

రించి తనగదిలోనికి నేగి యొకసోఫాపై గూర్చుండి యిట్లు యోచింపఁదొడఁగెను. "నాతమ్ముని పేరుతో నొకచీటికొందునా! తల్లిదండ్రులయాస్తినిఁ బొందుటకే మరదృష్టవంతుఁడగు వీనికీయాస్తి వచ్చునా? ఇదివట్టిభ్రమ. నూరు రూపాయి లెందుకు నిష్కారణము వ్యయపఱుప వలెను? నామనోవ్యథనుఁగాంచి దైవము వానియందుండి యీవార్తనాచెవిని వేసెనేమో. ఏమో వానియదృష్టమెట్లున్నదో, నరేంద్రసేనుగారిట్లే లాటరీవలనమహాధనికుఁడయ్యెగదా. కావున నొకచీటికొనెదను. దైవానుగ్రహము గలిగి లాటరీ మానీలమణిపేర గెలిచెనా, నాభర్తకును నాకు నింక వివాదలుండవు. నాభర్తపేర చీటికొందునా? ఒకవేళ గెలిచినచో నాయనయాస్తినీలమణికిచ్చునా? గెలిచితిమన్న సంతోషముచే వానితండ్రియాస్తివానికిచ్చునేమో. ఈ యిద్దఱిలో నెవ్వరదృష్టవంతులో, పోనీ యిద్దఱపేర చెఱియొక చీటి కొనినచో బాగుగనుండును. అట్లేచేసెద"నని యోచించి పరిజనునిఁ బిలిచి పాంథశాలలోఁ జీట్లమ్మువానికడకేగి రెండుచీట్లుకొనుమని రు 200 లు' ఇచ్చి యొకకాగితముపై చీటీలలోనుండవలసిన పేర్లనువ్రాసియిచ్చెను. అప్పటికి 9న్నర గంటలయినది. పరిజనుఁడు సత్వరతముగాఁబోయి రెండు చీట్లిమ్మని వేఁడగా సొమ్ముఁగైకొని చీట్లలో పేర్లువ్రాసి చించియిచ్చెను. వాఁడును వెంటనేవచ్చి యాచీట్లుశశికళకీయగా నామెదాచెను. రెండు దినములవఱకు నీమెయెంతోఁ బరితాప మొందుచుండెను. ఒకచీటియైన గెలిచినయెడలఁ దనమనోవ్యథ దీఱునని పుట్టెడాసపడియుండెను. ఇంకరేపు చీట్లుపట్టణమున గలిపెదరనఁగా, నీలమణి తెల తెల వారుచుండఁగా లేచి జీజీ యనియేడ్వఁదొణంగెను. శశికళ లేచి "యేమిబాబూ. భయములేదు' నేనిక్కడనేయుంటిని. ఎందుకమ్మా యేడ్చెదవు. ఏడవకమ్మ" నిదగ్గఱగాఁదీసెను. నీలమణి "జీజీ. పొడుగైన రెండుదంతములగల పెద్దయేనుఁగుమీఁద చక్కని తెల్లని జలతారుబట్టలువేసి దానిమీఁద బంగారపు హౌదావేసి యందులో నన్నుఁ గూర్చుండఁబెట్టి

యూరేగించినారు. ఇప్పుడులేదేమి: ఆయేనుఁగేదీ,, యనియడిగెను.

శశికళ— "నాయనా! ఎప్పుడెక్కినావు?

నీలమణి——"ఇప్పుడే,, ఈలాగునవచ్చినది.,,

శశికళ— తండ్రీ. నీవుకలగంటివి. అదినిజమయినయేనుఁగుకాదు. మనము కొనుక్కొందములే.,,

"ఏనికల శుభసూచకముగానున్నది. లాటరీగెల్చునేమో దైవమువానియందున్నాఁడు,, అనిమనసులోఁ దలంచి వానినితనతో పూవ్వులతోటలోనికిఁ దీసికొనివచ్చెను. నీలమణి "జీజీ. ఈపువ్వులేయొకదండగాఁగ్రుచ్చినామెడలో వేసినార,,నిచెప్పెను. సోదరిసంతసించి వీనికెంతో యదృష్టముపట్టనున్నదనినిశ్చయించికొనెను. మఱియొకగంటకు జయగోపాలబాబువచ్చెను. మధ్యాహ్నము విడియము సమలుచున్నపుడు నీలమణిస్వప్నవృత్తాంతము వినిపించెను.

జయ—వానినుక పందినెక్కమన లేకపోయితివా?

శశి—దేవా? మీరట్లు బాలునిపైనసూయఁ జూపఁదగునా! వానియదృష్ట మెట్లున్నదో. ఏనుగునేయెక్కునేమో;

జయ——సందేహమేమి? దానికేమిలోపము?

శశి—మంచికల. తెల్లవారుచుండఁగా వచ్చినది కావునత్వరలోనే వానికి (మేలు కలుగునని తోఁచును

జయ—నమ్మియుండుము.

ఇట్లుమాట్లాడుచున్న సమయములో వీధిగుమ్మములో "జయగోపాలబాబుగారూ,, అనిరెండుకేకలు వినిపించినవి. "ఎవ్వరువార,,నిజయగో. పాలుఁడు వడివడిగా వీధిగుమ్మములోనికి వచ్చెనుగాని మెడలోడవాలుబిళ్ళగలిగిన బంట్రోతును గాంచగాఁనే వానిప్రాణములెగిరి పోయినవి మొగముపై కత్తివేసిననెత్తురు లేనట్లు తెల్లఁబడెను. కాళ్లువణకనారంభించెను

"మహారాజ్ హుకుమ్,, అన్నిభటుఁడొక పెద్దయుత్తరమిచ్చెను. పైపేరు చూచి కలెక్టరు వారియొద్దనుండి వచ్చినట్లు గ్రహించి చేయ్యివణకుచుండఁ

గా నొంటిపాత్రిణముతో పైకాకితముచిమ్మచి లోననున్న యుత్తరము వెలికి దీసికనులుమిర్మిల్లు గొలుప నెట్టకేలకుఁ జదివి ధైర్యము తెచ్చుకొని సరే యనిచెప్పిభటుని. పంపివేసి లోనికివచ్చి పరిజనుని బిలిచి "రేపు తెల్లవారుసరికి గుఱ్ఱపుబండిసిద్ధముచేయుమని గుఱ్ఱపువానితోఁ జెప్పెను. నాఁటిరాత్రి శయనించునప్పుడు శశికళ భర్తతో "ఏమిత్రుని [illegible] కార్యమునకుఁ బోవుచుంటిరో ఎడబాపునకలవాటులేమి మీరు చెప్పినను [illegible] నిని మిషములు యుగప్రాయములై యుండును. తిరిగియెన్న [illegible] దురని పలికెను. జయగోపాలుఁడేకళనుండెనోగాని [illegible] కార్యములఁ గాంచుటకుఁగాను. రేపుపదిగంటలకు పట్టణములో గొప్ప లాటరీజరుగునట. దానికి ముప్పదిమందిసభికులవిచ్చయించిరి. అందులో నేనొకఁడను. పెద్దకలెక్టరు గారగ్రాసనాధిపతుల,, నిచెప్పెను. ఆలాటరీలో మీరొకచీటినిఁగొంటిరా? యనిశశికళ యడిగెను.

జయగోపాలుఁడు— లేదు. సీతమ్మునిపేర నొకచీటి కొనక పోతినా? అదృష్టవంతుఁడేమో.

శశి— వానికంతయదృష్టముపట్టునా? మీరింతవఱకు దీనిఁగూర్చి యెఱుఁగరా; ఎఱిగియిష్టములేక చీటిఁగొనలేదా:

జయ— ఎఱుఁగుదును. కానివాని యందంత నమ్మకములేక కొనలేదు.

శశి—కొనిమూడిన తెలియునుకాని యూఱకున్న నెట్లు తెలియఁగలదు.

జయ— నిజమేకాని యిష్టపడుమించినదానికి వగపేల?

ఇటులుమాటలాడుకొని నిద్రించిరి. మఱునాఁడు తెల్లవారగానే గుఱ్ఱపుబండి యెక్కి పట్టణమునకుఁ బోయెను. పదిగంటలవేళ కాకమునుపే యీ లాటరీకలుప నిర్ణయించిన మైదానముపై వేయబడిన బహువిశాలమగు పందిటిలో వేలకొలఁదిజనులునిండియుండిరి. ఆపందిటిలో నొకసర్వజన గోచరానుకూలస్థలమందెత్తుగా నొకవేదిక నిర్మింపఁబడి దానిపైముప్పదికుర్చీలు వేయబడియున్నవి. మధ్యనున్న పెద్దకుర్చీకి నెదురుగా

నొకయంత్రముపన్నబడియున్నది. పదిగంటలగు సరికి పెద్ద కలెక్టరుగారు డిప్యూటీకలెక్టరు దేవీప్రసన్న బాబుగారును దయచేసిరి. జయగోపాలుఁ డొకపెద్దమనుష్యుఁడగుటచే నాతఁడును పైకెక్కి-కూర్చుండెను. చీట్లుసరిచూచి యీయంత్రములోఁబోసిరి. లాటరీవేయబడు సౌధములపట్టములును, నాలుగు గుఱ్ఱములును, బండును, ఏనుఁగయు, నీసభాస్థలికి వెనుకనిలచి యున్నవి. నగదుసొమ్ము జాలిసంచులలోఁ బోయఁబడి సంచులకుప్పవేదిక పైయంత్రమునగ్గఱ నుంచఁబడినది. రెండుగంటల కాలమగుసరికి కలెక్టరుగారు హిందూభాషతో లాటరీకలుపఁబడునని చెప్పెను. పెద్దగంట చప్పుడుచేయఁబడినది యంత్రము త్రిప్పనారంభించిరి. నూరుపేర్లు వచ్చినవి కాని యెవ్వరును గెలువలేదు. 101 పేరు జయగోపాల బాబు శ్రీరామపురమని వచ్చినది కాని లాటరీగెలువలేదు. మఱి 98 చీట్లు వచ్చినవి కాని వారి కాశాభంగమైనది. 200 చీటి సోదరి శశికళ వశమ్ములోనున్న (మైనరు) బాలుఁడు నీలమణి శ్రీరామ పురమని పేరువచ్చినది. లాటరీ గెలుపుచీటి వచ్చినది. దొరగారు గంట మ్రోగించిరి. జనులందఱుగొల్లుమని చెవులుచిల్లులుపడునట్లు చప్పట్లుగొట్టిరి. ఏనుగు తనకింక నధిపతి యేర్పడెనని కాఁబోలు ఘీంకరించెను. గుఱ్ఱములు గెలుపున కానందించునట్లుసకిలించెను. ఒక్కయరగంటకు గంధరగోళముకొంతతగ్గెను. సభవారి సందడిని చల్లార్చుటకు రక్షకభటులును, వారియధిపతులును ఎంతో శ్రమపడిరి. కొంతసేపటికి సభాస్థలములో సందడి శాంతింపగాఁ గలెక్టరు వారులేచి యీబాలునెవ్వరయినా నెఱుఁగుదురా? యనియడిగిరి. జయగోపాలుఁడు లేచి "ఆ బాలుఁడు నా భావమఱఁది. శ్రీరామపురములోనుండెన" ని విన్నవించెను.

కలె:—ఆబాలుని తండ్రిపేరేమి?

జయ:—కాళీప్రసన్న బాబు.

కలె:—ఓహో! నేనాయన నెఱుఁగుదును. ఆయనది గొప్ప ఆస్తియుం

డవలెను. జాగ్రత్తగా నున్నదా?

జయ:— ఇంచుమించుగా నంతయుఁబోయినది.

కలె:—ఏమనుచున్నది. ఇప్పుడాభూమి యెవ్వరివశములో నున్నవి.

జయ:— (వణకుచు) నావశములో నున్నవి.

కలె:—నీవశములోనుండఁగా నెల్లుపోయినవి?

జయ:—హక్కునాదైనది. దానికి కాళీప్రసన్నబాబుగారి వీలుకొంత యాధారము.

కలె:—దేవీప్రసన్న బాబుగారూ? గొప్పయాస్తిగనుక రాజకుమార రక్షణసంఘమువారి యాధీనములోనుంచి బాలునకు వయసువచ్చువఱకు గాపాడవలయును ఈసొమ్ము ధనాగారమునకుఁ బంపుము జయగోపాలబాబుగారి నిప్పుడువిడువక మీతోనుంచుకొని రేపటిదినమున శ్రీరామపురమేగి యాబాలుని నేనుగుపైఁ గూర్చుండఁబెట్టి యుత్సవముతో రప్పింపుము. ఆబాలుని దివ్యభవనములలో నొకదాని యందుఁ బ్రవేశపెట్టుఁడు. దానినినేఁడే బాగుచేయించి యలంకారముసేయింప జనపదాధికారికి వర్తమానము చేయుఁడు. ఈయుత్సవమునకు వేయిరూపాయిలు వ్యయపఱుపననుమతించితిని. కాళీప్రసన్నబాబుగారి యాస్తి జయగోపాలున కెట్లు వచ్చినదో కనుంగొని యందుమోసమున్నయెడల విచారణచేసి మీ యభిప్రాయముతో నాకు జాబువ్రాయుఁడు"

దేవీప్రసన్న బాబు చిత్తమనెను. రక్షకభటసహాయముచే నగదులో రు 1000 గాక మిగిలినది ధనాగారమునకుఁ బంపఁబడెను. ఆరాత్రియే యొకసౌధమును శృంగారింపదొరకొనిరి. నీలమణికిగలిగిన యదృష్టమునకు జనులువిస్తుల్లగొనియాడిరి. ఈచర్యనుగాంచి తారభర్త పరుగుపరుగున శ్రీరామపురముచేరి భార్యతోఁజెప్పెను. తార యత్యత్వరితముగా శశికళనుగాంచి మీతమ్ముఁడు లాటరీగెలిచినాడట యనిచెప్పెను. ఆ

వారీ చెవినిఁబడఁగానే చేతిలోని గ్రంథమువిడిచి కొంతసేపటివఱకు లోనగలిగిన సంతోషముచేఁ గొంతమైనఁ బైటకుఁ దెలుప లేనంతవఱకు నిశ్చేష్టయై చిత్తరువునందలి బొమ్మవలె ఱెప్పవాలకయుండి మఱికొంత సేపటికి నూపిరివిడిచి చేరువనున్న నీలమణిని గౌగలించి కన్నులనీరు పెట్టుకొనెను.

తార:—శశికళా! నీశాంతము నీనేర్పు. నీతమ్ముని పెంచినమార్గము వేయి నోళ్ల బొగడదగినది.

శశి:—తారా! నాఁడునీవు చెప్పినప్పటినుండియు నాతమ్మునిఁ బెంచుటలో నెంతయపకీర్తి పడితినోయని చింతించితిని.

తార:—నీవుగనుక నిట్లు భరించితివి కాని మఱియెవ్వరితరమూ కాదు. నీభర్త దారుణము చేసినను నీతమ్మునిఁ గాపాడితివి. నీలమణి లాటరీ గెలుచుట నీసతీత్వము నీన్యాయవర్తనము నీశాంతము చూచి భగవంతుఁడు నీయందనుగ్రహించుటచేతనే జరిగినదిగాని కేవలమాతని సుకృతముకాదు.

శశి:—నాభర్తగారిపేర నొకచీటివేసితిని.

తార:—అదిపోయినదట. ఆయనగెలిచినచో నీకుమఱింత దుఃఖము వచ్చియుండును.

శశి:—నీవెఱ్ఱితారా? నాభర్త గెలిచిన నాకెంతో సంతోషమే. ఆయనయుప్పొంగిపోవును. ఆయనయెఱుఁగకుండ చీటివేసినపుడాయనగెలచిరేని దత్సంతోషములో నాతండ్రియాస్తి నాతమ్మున కిచ్చి నామీఁద నెంతో ప్రేమ చూపకుందురా?

తార:—ఇప్పుడయిననేమి. నీతమ్మునికిగొప్పయాస్తి సంపాదించితివి. నీభర్తకు నీతండ్రియాస్తి దక్కినది. ఏమయినను నీవుగొప్ప యిల్లాలవు. మగఁడన్ని విధముల నీయందసూయతఁజూపినను శాంతముతో న్యాయమని నీవుచేపట్టిన కార్యము నిగ్రహించితివి. ఆస్తిని దొరతనము నా

రే బాలునకు యుక్తవయసు వచ్చునటులకు బాలింతువట.

శశి:—ఇంక నాభారము తీరినది.

ఇటుల మాటలాడి తారవెడలిపోయెను. శశికళ కారాత్రి నిద్ర పట్టలేదు.

# పదివ ప్రకరణము.



సాధారణముగా రాత్రి నాలుగుజాము లయినను శశికళకుండి సత్యము కాదను కొనునంతటి యాత్రితకలిగెను కోశికూతవినంబడెను వెంటనే దంత ధావనముచేసి పరిజనుల లేపి తనసౌధ మలంకరింప నియమించెను. తనపిల్లలను నీలమణిని స్నానములుచేయించి త్వరితముగాఁ దలల నారఁజెట్టి యుచితరీతివారి నందరి నలంకరించెను. నీలమణిలాటరీ గెలిచి నవాతఁ రాత్రియే గ్రామమంతకుఁ దెలిసినదిగనుక నూరిలోనివారు కాకులుకూయ దొలకొన్నది మొదలు శశికళ మేడకువచ్చి యెవ్వరికిఁదోచిన రీతినివారు గృహాలంకారమునకుఁ దోడ్పడుటచే నెవ్వరుపరిజనులో నెవ్వరితరులోఁ బోల్పశక్యము కాకుండెను. ఇంతలోఁ బట్టణమునుండి బయలుదేఱినవారిలోఁ గొందఱు హుటాహుటినడకల శ్రీరామపురమునుఁ జేరి కలెక్టరువారు వచ్చుచున్నారని తెలిపిరి. పౌరులెల్ల కాళీప్రసన్న బాబుగారిపై దమకుండు ప్రేమాతిశయము వెల్లడి యగునట్లు, ప్రేమను ష్పుఁడును తానే లాటరీ గెలిచినంత సంతసముఁబొందుచుఁ దమగృహంబులఁ దగినరీతి నలంకరించుటయేకాక గ్రామమును వీధులను జెండాలతోను తోరణములతోను కనులపండువుగా నలంకరింపదొడంగిరి. జయగోపాలుఁడు నీలమణిసొమ్మ నపహరించిన విధము నేఁడు బయటపడిఱయనకుఁ జిక్కులుగలు గఁబోవుచున్నది కావున శశికళ దానికిఁ జింతించు

నో తమ్మునకు మేలుకలిగినది కావున సంతసించునో చూడవలసియున్నరని పోఁగలుతలంచిరి. కొందఱు జయగోపాలునకుఁ గారాగృహవాసముతప్పదనిరి. శశికళ తప్పించునని కొందఱెంచిరి? వాదప్రతివాదములు జరుగుచుండెను. పదిగంటలగుసరికి ముందుగా గొందరు రక్షకభటులును వారి యధిపతియు వచ్చిరి వారి వెనుక వందలకొలది, జనులు వచ్చుచుండిరి. గుఱ్ఱపుబండ్లలో నుద్యోగియులు కూరిచుండి వచ్చుచుండిరి. ఒకబండిలో జయగోపాలుఁడును అతనిసోదరుఁడునుఁ గూర్చుండిరి. లాటురీకలుపురాఁడు జయగోపాలుని సోదరుఁడువచ్చి కలెక్టరుగారు తనసోదరునినడిగిన ప్రశ్నలఁబట్టి యాతని కేమియుపాయము వాటిల్లునో యని యన్నగారిని విడువలేకవచ్చు చుండెను. వీరి వెనుక ఏనుగుశృంగారముగా నలంకరింపఁబడివచ్చుచుండెను. దంతములకు బంగారుతొడవు లమర్చిరి. ఏనుగుపైఁబెద్దగంటలు రెండు చెఱియొకప్రక్క మ్రోగునట్లు వేసిరి. మెడలో పెద్దపెద్ద మువ్వలపేరు వేయఁబడినది. ముఖమునకుఁ బట్టాభిషేకచిహ్నము వేయఁబడియున్నది. అందముగా బుటేవారు పనిచేయబడిన సితకౌశేయాప్తరణము వేయఁబడినది. అప్పుబట్ట పయిని వెండి హౌదా వేయఁబడి యున్నది. ముందు మెడపైఁ జక్కని దుస్తుధరించుకొనిన మావటివాఁడు కుడిచేతులో నంకుశముధరించికూర్చుని యుండెను. హౌదాలో నొకఁడు చక్కగా నలంకరించుకొని తెల్లని పట్టుగొడుగు విప్పి పట్టుకొని యుండెను. హౌదాలో నెవ్వరునుఁ గూర్చుండలేదు. ఆయేనుఁగు వెనుక పెక్కుమంది గుఱ్ఱపుబండ్లతో వచ్చుచుండిరి. వీరెల్లరు రాకపోరని శశికళ గ్రహించి తానెంతతొందరకార్యములోనున్నను రెండుమూగు వేల జనమునకుఁ దగినభోజన సన్నాహము చేయించెను. ఇంతమంది జనమా చిన్న యూరున కెన్నఁడు రాకపోవుటచే, నాయూరెక్కడ చూచినను జనులచే నిండియుండి యిసుకజల్లిన క్రిందరాలకుండు నట్లుండెను. రక్షకభటులుసహాయమున దేవీప్రసన్నబాబువారి ముఖ్యద్వారమును

నీలమణియున్న గృహములో ప్రవేశించిరి. వారికదివఱకే యమర్పఁబడి యున్న యాసనములపై గూర్చుండిరి. జయగోపాలునిఁజూచి నీలమణిని దీసుకొనిరమ్మని పంపెను. ఆయనలోనికిఁజని భార్యనుఁగాంచి యేదియో చెప్పబోయి నోటమాటరాక యెట్టకేలకామె కుడిచేతిని తనకుడిచేతితో దీసి ప్రేమపూర్వకముగా నొక్కించి చెంతనిలచియున్న నీలమణినెత్తుకొనఁబోయెను. వాఁడుదొరకక సోదరి రెండవప్రక్కకుఁబోయెను. "నీ యేనుగు గుఱ్ఱములువచ్చినవి చూపించెదను రమ్మ"ని నీలమణికుడిచేతినిఁ బట్టెను. తరువాత "వెళ్ళుతమ్ముఁడా" యనిచెప్పగా జయగోపాలునివెంట వచ్చెను. సభామధ్యమునకు బాలుఁడురాఁగానే సభవారందరు నిలిచిరి. బాలుఁడువారినిఁజూచి యెవ్వరుచూపకుండ కోరకుండ. కాళీగామధ్యను వేయఁబడిన యాసనమెక్కి కూర్చుండెను. అందఱును సంతోషపూర్వకకరతాళములుగావింప వీధిలోనుంచఁబడిన బాన్ వాద్యము మ్రోగనారంభించెను. అందఱుకూర్చుండిరి. అప్పుడు సభవారికి దేవిప్రసన్నగారు నీలమణి లాటరీగెలిచెననియు గొప్పయాస్తి దక్కినదనియు రాజకుమార సంరక్షణసంఘము వారియాధీనములో నీబాలుడుంచఁబడుటకు దొరవారి యాజ్ఞయైనదనియు చెప్పెను. కరతాళధ్వనులునిగిడినవి. జయగోపాలుఁడు లోనికేగి తిరిగివచ్చి "మహాజనులారా! అందరకుసంతోషకరమగు కార్యము జరిగినదిగనుక, ఈవేడుక చూడవచ్చినవారందఱు నేఁడీభవనమందున భుజింపగోరుచున్నా"నని చెప్పగా కరతాళధ్వనులతో సభచాలించిరి. ఒక గంటవఱకుఁ దత్సబాధలిలో మాటలధ్వనులుపుట్ట దేవిప్రసన్నబాబును, మఱియిద్దఱు మువ్వురునుతప్పఁ దక్కినవారెల్లసభవిడిచిరి, సభాభవనమలంకరించినతీరును, నీలమణిముఖమునఁగలిగినకళను, ముచ్చటించుకొందఱును, నదీతీరమునకుఁ గొందరును, పురవీధులలోనికిఁ గొందరును మేడకెదురుగానున్న బయలుపైనిలిపిన ఏనుగు, గుఱ్ఱములు, బండ్లనుచూచుచు కొందఱును ఇట్లుకన్నుల పండువుగా నుండెను. వర్ణనివక్షతతో

నొంటి గంట కందఱి భోజనములైనవి. ఇంతలో శశికళ చేయించిన యీ యేర్పాటునకు సంతసింపని వాఁడొక్కఁడైనను నందు లేడు. మూఁడుగంటలవఱకును ఏవిధమైన సందడియు లేదు. అపుడు కాళీప్రసన్న బాబుగారి యాస్తినిగూర్చి దేవీప్రసన్న బాబుగారు విచారణచేయ నారంభించిరి. ఇందు శశికళ సాక్ష్యము ముఖ్యమైన దగుటచే నామెనురప్పించి తెరవేసి యావెనుక నిలిపిరి.

జయగోపాలుఁడు తనకేమి మోసము వచ్చునోయని భయమొందుచుండెను. వచ్చినవారిలో ముఖ్యులు సభలోఁ గూర్చుండిరి. నీలమణి కలెక్టరువారిచెంత నున్న తాసనముపైఁ గూర్చుండఁబెట్టఁబడెను. భోజనములయినపిదప నీవిచారణ జరుగుటకు ముందుగల కాలములో జయగోపాలుని సోదరుఁడు దొరతనమువారిపన్ను చెల్లింపక కొన్ని భూములు తానుకొనుటచే నిపుడాభూములను తిరిగి నీలమణి పేర దస్తవేజును వ్రాసి శశికళకు జయగోపాలుండుండగా నిచ్చెను. శశికళయు సంతసించి యాతఁడు వ్యయముచేసిన సొమ్మిచ్చివేయుటకు నిశ్చయించుకొని యెంతవ్యయపెట్టఁబడెనోయని యడుగునపుడు తనచేతినొక రూపాయియైనను వ్యయపడలేదనియు, పన్నులు చెల్లించు సమయము ప్రమాదవశమున మించుటచే ఏలముపాడునపుడన్నగారి ప్రోత్సాహముచేఁ దనపేరఁ బాడితి ననియు నీలమణికిఁ దిరిగి యిచ్చుటలోఁ దనకేమియు రావలసినది లేదనియు, మఱిది చెప్పఁగా శశికళ సంతసించెను. పిదప మూఁడుగంటలవేళ శశికళా భర్త చేసిన వ్యవహారమునుగూర్చి కలెక్టరువారు విచారణసేయఁ దొడంగెనపుడు వ్యవహారమెట్లు ముగియునోయని పెక్కుమంది వచ్చియుండిరి తాను కపటముగాఁ బ్రవర్తించుటచే శశికళ సాక్ష్యమిచ్చుటలోఁ దనకేమి ముప్పు తెచ్చిపెట్టునోయని జయగోపాలుఁడొంటిప్రాణముతో నుత్సాహము చెడి కూర్చుండెను. సభయంతయు నిశ్శబ్దముగానున్నపుడీక్రిందితీరున విచారణ జరిగెను.

కలె:—ఏతీమ్మా! నీలమణి తల్లిదండ్రులు గతించియుండినప్పటి నుండియు, బాలుడెవ్వరి వశములో నుండెను.

శశి:—మా యుభయుల వశములో నుండెను.

కలె:—మీ భర్తగారికి బాలునియం దిష్టమేనా?

శశి:—ఇష్టమే.

కలె:—లోకులాకీర్తినిం జెప్పుకొనుచుండుట లేదు?

శశి:—నాయుభర్తను పక్షిరి కాని యందు సత్యమున్నట్లుతోపదు.

కలె:—జయగోపాలుఁడుగారు నీలమణి నెన్నఁడు దరికిరానీయక యనిష్టముగాఁజూచుచుండిరట కాదా?

శశి.—కలెక్టరుగారూ! తల్లిదండ్రులు లేని పిల్లవాఁడు గనుక నట్టి వారిని గారాబముతోను కనికరముతోను, బంధువులు చూచుట లోకస్వభావము. కాని మాతండ్రిగారయిన కాళీప్రసన్న బాబుగారు సంపాదించిన కీర్తి జగద్విదితము. ఆయనకు మావాఁడు భయభక్తులు లేక మిక్కిలి గారాబముతోఁ బెరిగిన కాలక్రమమున నల్లరిపిల్లవాఁ డగునేమో యనియు, వారియొద్ద నలవాటుపడినయెడల రాచకార్య వ్యవహారముల కాయనపొరుగూరికి పోవుట తప్పనిదగుటచే, నాయనకడ చనవుకలిగినయెడల తల్లిదండ్రులులేని బాలుఁడు బెంగటిల్లునేమో యనియు, తలంచి యాయనదగ్గర నంతగాఁజేయక యాయనయెడ బాలునకించుక భయముకలుగునట్లు సంచరించిరే కాని, నీలమణిపై నిష్టములేకపోలేదు.

కలె:—వింతగానున్నది, కాళీప్రసన్న బాబుగారి యాస్తి జయగోపాలుని పేర నుండుట కేమి కారణము.

శశి:—నాతండ్రిగారికిఁ జిరకాలమువఱకు నేనొక్కతెనే పుత్రికను. వేఱుసంతానములేక నామీఁదినురాగమున నన్నత్తవారింటి కనుపక నాభర్తగారిని యిల్లటపుట్లునిగా గ్రహించి వారియాస్తి యంత

యు నాకీయబోడంగిరి. నాభర్తగారు చిరకాలమునుండి యిచ్చట నేయున్నారు. మరణమెప్పుడుసంభవించునో తెలిసికొనుట దుస్తరము కావున వారునయే నాప్రియ భర్తగారి పేర తమయాస్తివ్రాయించిరేమో తెలియదు.

కలె:—అట్లయిన మీపేరవేయింపక ఆయనపేరవ్రాయింపఁ గారణమేమి?

శశి:—గొప్పయాస్తి యగుటచే రాచకార్య వ్యవహారములలోఁ దఱచు నా నాపేరనున్నవహారము జరుగుటనాకంత యిష్టములేదు గనుకను నాప్రియభర్తగారును నేనును భేద బుద్ధి గలవారము కాముగనుకను, నీలమణి జనియింపక యున్నచో నాపిల్లలకే యెట్లయినఁజెందును గనుకను, నా భర్తగారిపేర వ్రాయించి యుందును.

కలె:—నీలమణి పుట్టెనుగదా? ఆయాస్తి యిపుడేమి కావలయును?

శశి:—మాతండ్రిగారు మరణశాసనము వ్రాసియున్నారు. నాకొకవంతును, నాతమ్మునకు రెండువంతులును ఆస్తి యిచ్చియున్నారు.

కలె:—అట్లయిన నీతమ్మునియాస్తి యేలవిడవేయలేదు?

శశి:—మానీలమణి దైవానుగ్రహమువలనఁ బెద్దవాఁడయిన పిదప మేలుకీళ్లను బరిశీలించి పంచియిచ్చుట న్యాయమని యింకను విడదీయక యాస్తినికలిపియే యుంచినారు.

కలె:—ఇప్పుడు నీలమణియాస్తిని దొరతనమువారి పరముగానుంచి జాగ్రత్తచేయుటకు దొరతనమువారియాజ్ఞ మీకభ్యంతర మేమియైననుండునా?

శశి:—ఏమియు నభ్యంతరములేదు.

కలె:—ఈయాస్తిలోకొంత దొరతనమువారిపన్నులు చెల్లింపక వేలము వేయబడినదట కాదా?

శశి:—ప్రమాదవశమున బన్ను చెల్లించు దినము గతించుటచే నట్టిస్థితి సంభవించినను, తిరిగియాయాస్తిమాకేవచ్చినది. ఇప్పుడు దానియభ్యం

తరమేమియు లేదు.

కలె:—ప్రస్తుతము వచ్చుచున్న ఫలమును బట్టి భూములువిడదీసి మీపా లు మీకువిడిచి తక్కిన రెండుపాళ్లును దొరతనమువారి పరము చే యఁబడును.

శశి:—చిత్తము.

కలె:—ఏమండి జయగోపాలబాబుగారు? మీపేర వ్రాయఁబడిన యా స్తితిరిగి నీలమణిపేర మీ మామగారువ్రాసిన మరణశాసన మనుస రించి యిచ్చుట కభ్యంతర ముండునా?

జయ:— ఏమియును లేదు.

కలె:— ఆమరణశాసనమేది?

జయ:— (తెచ్చియిచ్చును)

కలె:—ఇది యాయన మరణానంతరము రిజిస్టరీయైనదా? ఇన్ని సాక్షివ్రా ళ్లున్నవే. (చూచి) సరే. ఆస్తిజాపితా యిందులోనున్నది. ఇప్పుడీ ఆ స్తియంతయు నున్నదా?

జయ:— చిత్తము.

కలె:—ఇప్పటికి (అని లెక్కచూచి) నింతయెక్కువ కావలయును ఉన్నదా.

జయ:—ఉన్నది.

కలె:—నీలమణి ఆస్తివిడదీయుటకు దొరవారియాజ్ఞననుసరించి తగినవా రినినియమింతుము. అమ్మగారూ! మీనీలమణికిసంరక్షకుఁడేర్పడవల యును. మీయభిప్రాయానుసారముగా నేరినినియమింపఁగోరెదరు?

శశి:—నాభర్తగారినే సంరక్షకునిగా నియమింపుడు.

కలె:—సరే, బాలుఁడీగ్రామములోనుండుటకువీలులేదు. మీరుకూడపట్ట ణములోనికివచ్చి మీసోదరుని భవనమందుండుటకభ్యంతరముండునా?

జయ:—నన్నుసంరక్షకునిగా నేర్పఱుపఁదలంచినయెడల మేమందరము పట్టణముననే యుందుము.

కలె:— జయగోపాలబాబుగారు, ఈకాగితముమీఁద నామంచేవ్రాలు చేయవలయును.

జయ:—చేయించి తీసుకొనివచ్చెను.

మఱునాఁడు పట్టణమున కేగనిశ్చయించిరి. ఇంతలో,

శశి:—అన్నయ్యగారూ! మాతల్లియైన విభావతి మీకెటువంటి చుట్టమో మీకు జ్ఞాపకమున్నదా?

కలె:—సోదరీ! నీచిన్నతనమందు నేనుచూచితిని. నాకుజ్ఞాపకమున్నది. వ్యవహారము విచారణ జరుగుటకుఁ బూర్వమే మనబంధుత్వము తెలుపుటకంటె నిపుడు తెలుపుట యుక్తమని యింతవఱకుఁ దెలుపక నిలిపితిని. నీకును నీభర్తకును నీలమణినిఁగూర్చి వైమనస్యము కలిగియుండెననివిని నీభర్తనుగూర్చి విచారణసేయుటలో నీతని మోసము బయలుపడునని జనులవలన వింటిని. అట్టిది యిందేదియుఁ గాన్పింపదు.

కలెక్టరుగారిల్లుపలికి బసకువిజయముసేయునపుడు శశికళ "సోదరా! మీరును మీపరివారము రాత్రికూడ నిచ్చటనే యుండ వలయునని నాప్రార్థనము" నియె. కలెక్టరువారు సమ్మతించిరి. భర్తపై నేర మగుపర్చక చమత్కారముగా దాటించిన శశికళా శీలత్వమందఱి నాశ్చర్యసాగరమునముంచివైచెను. ఇంకసాయంత్రము భోజనములైనపిదప నిద్రింపఁబోయినపుడు శశికళా జయగోపాలుర కీక్రింది ప్రసంగము జరిగెను.

జయ:—నీశీలత్వమునకును, నీస్వభావమునకును, నీశాంతమునకును, నేనెంతో యాశ్చర్యపడితిని.

శశి:—నాథా! ఇందాశ్చర్య మేమిగలదు.

జయ:—బుద్ధిలేక నేను నీపయినసూయత చూపినందుకు నేనుమిక్కిలి పశ్చాత్తాపపడుచుంటిని (అని కనులనీరు పెట్టుకొనెను)

శశి:— (కౌఁగలించి) ప్రాణేశ్వరా! మీరిట్లుసేయఁదగదు. మీరువిచారిం

కబ్జా చేయింపఁబడిన భవనము దిగిరి. అచోట కలెక్టరువారు వచ్చి యుండిరి. దేవీప్రసన్న బాబు వ్యవహారమంతయు నివేదించెను. దొరవారు సంతసించి శశికళను సంరక్షకురాలినిగాను జయగోపాల బాబును ఈ విషయమునకగు కార్యస్థానములో ముఖ్యాధికారినిగాను నియమించి, నీలమణి కిచ్చిన వేఱొక్క సౌధములోఁ గార్యస్థానముంచ నియమించిరి. శ్రీరామపురములోని గృహములో నొకయుద్యోగియుని నిలిపిరి. కాళీప్రసన్న బాబుగారి మరణశాసనము ప్రకారము జరుపుటకు నొకసంఘమేర్పఱచి దానికధ్యక్షునిగా దేవీప్రసన్న బాబును నియమించెను. నీలమణి నాఁటఁబెద్దవాఁడై యుక్తముగా విద్యనేర్వ నారంభించెను. శశికళ సోదరునిఁ గాపాడిన విధమును నీలమణి కష్టము బట్టినరీతియు, జయగోపాలు డెంత యనూహ్యమాగ్రిష్టుఁడైనను తుదకుఁ బశ్చాత్తాపముకలిగి సన్మార్గవర్తను డయిన రీతియుగును. ఇన్నిటికి నాధారముగా శశికళా సుగుణసంపద, శాంతము, శీలము, ఋజుమార్గవర్తన సత్కార్యాభినివేశము, సమయానుకూలజ్ఞానము మొదలగుగణములను జనులెల్లరు వేయి విధంబులఁ గొనియాడిరి.

న్యాయపక్షమున నెప్పుడు భగవంతుఁడు నిలుచును. కావున మొదట నెన్నిచిక్కులు కలిగినను పట్టుదల గలిగి న్యాయమార్గము దప్పకుండిన మొదల తుదకు న్యాయముకే జయము.

సమాప్తము

